# శ్రీ రామాయణ గానసుధ

## (అరణ్యకాండము)




గ్రంథకర్త

''కళారత్న''

శ్రీ పంతుల లక్ష్మీనారాయణరావు

విశాఖపట్నం

# శ్రీ రామాయణ గానసుధ

## (అరణ్యకాండము)



గ్రంథకర్త

**''కళారత్న''**

**శ్రీ పంతుల లక్ష్మీనారాయణరావు**

విశాఖపట్నం

Sree Ramayana Ganasudha
**(ARANYA KANDAMU)**

By **"KALARATNA" "PAVANI SUNDARA GANA LOLA"**
**PANTULA LAKSHMI NARAYANA RAO**

Published 21-4-2002 (Sri Rama Navami)

No of copies 1000



Books Available at 'Kalaratna" P L NARAYANA RAO
"Sri Rama Maruti"
D No 43-7-32, Rly New Colony,
Visakhapatnam - 530 016
Phone 561603

**Price Rs 55-00**

Printed at
**SARVANI PRINTERS**
48-12-9, Srinagar, Visakhapatnam

కృతికర్త దంపతులు



శ్రీ పి ఎల్ నారాయణరావు, శ్రీమతి గిరిజాకుమారి



గ్రంధకర్త, ఆగష్టు 15, 1956 పోర్టుజింఖానా క్లబ్బులో మొదటి
లలితసంగీతకచేరి (16 సం॥ వయస్సులో)



1992 సుందరకాండ ఆవిష్కరణ సభ, శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామివారి ఆశీస్సులందుకుంటున్న గ్రంధకర్త



గ్రంధకర్తకు " **పావని సుందరగానలోల**" బిరుదు ప్రదానం గావిస్తున్న ప్రముఖులు శ్రీ డి వి సుబ్బారావు నగర మేయరు,
డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డి, Vice Chancelor A U
కళాప్రపూర్ణ జి అచ్యుత రామరాజు



తేది 28-12-98 విశాఖరత్న వారిచే 'కళారత్న' అవార్డు అందుకుంటున్న గ్రంథకర్త శ్రీ పి ఎల్ నారాయణరావు



"కళాభినేత్రి" జమునా రమణారావు గారితో గళం కలిపి పాడుతున్న గ్రంథకర్త



ఆంధ్ర విశ్వవిద్యాలయం డైమండ్ జూబ్లీ సందర్భంగా
శ్రీ ఎమ్ ఆర్ అప్పారావు గారిచే సన్మానింపబడిన గ్రంధకర్త
పి ఎల్ నారాయణరావు " కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి గారితో



పుష్పగిరి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శంకరాచార్యుల వారి వద్ద
మొట్ట మొదట " శ్రీ ఆంజనేయ స్వామి చరిత్ర" పాడిన
శ్రీ కళారత్న పి ఎల్ నారాయణరావు, శ్రీ పి ఎస్ ఎన్ మూర్తి (తబల)

# పరితోషం

శ్రీ మద్రామాయణరచనకి వాల్మీకి మహర్షిని ప్రోత్సహిస్తూ బ్రహ్మ "**నీవు రచించిన రామకథ భూమిపై పర్వతాలు నదులు ఉన్నంతకాలం లోకంలో ప్రచారంలో ఉంటుంది**" అని ఆశీర్వదించినాడు బ్రహ్మ వాక్కు వ్యర్థంకాదు గదా భారతదేశంలో రామకథని ఎందరో మహాకవులు ఎన్నెన్నోభాషలలో ఎన్నెన్నోప్రక్రియలలో నేటికినీ రచిస్తూనేయున్నారు ఈనాడు **శ్రీపంతుల లక్ష్మీనారాయణరావు** గానానుకూలంగా "**శ్రీరామాయణగానసుధ**" అనే పేరుతో రామకథని సంతరించడం అస్మదాదులకు పరమహర్షదాయకం

శ్రీమద్రామాయణంలోని ఒక్కొక్కకాండలో ఒక్కొక్క విధమైన ప్రత్యేకత ప్రస్ఫుటవవౌతుంది భారతీయ సంస్కృతికి పరమాధారమనదగ్గ ఆశ్రమచతుష్టయంలో మూడవదియైన వాన ప్రస్థాశ్రమవైభవం అరణ్యకాండలో చక్కగా విశదమౌతుంది లౌకిక భోగాలను పరిత్యజించి ఆముష్మికసుఖప్రాప్తికై మహర్షులు ఆరణ్యకజీవితాన్ని ఏవిధంగా గడుపుతున్నారో ఆకాండలో నిరూపింపబడింది ఖరదూషణాది రాక్షస సంహారంలో రాముని అవతారప్రయోజనమైన దుష్టశిక్షణ అనేధర్మం నిర్వర్తింపబడింది

రాముని అవతారం యొుక్క ప్రధాన లక్ష్యం తపోబలగర్వితుడైన రావణుని సంహరించడం దానికి అంగభూతములైన శూర్పణఖ ప్రవృత్తి, సీతాపహరణం అనేవి అరణ్యకాండలోనే అభివర్ణింపబడ్డాయి

శ్రీపంతుల లక్ష్మీనారాయణరావుగారు చిన్నచిన్న పదాలతో ఝుడిత్యర్థస్ఫోరకంగా శ్రవణపేయంగా గానానుకూలంగా

అరణ్యకాండను రచించి కృతకృత్యులైనారు పదలాలిత్యమూ భావవైశద్యమూ, వీరిరచనలోని విశిష్టలక్షణాలు సన్నివేశాన్ని వీలయినంతవరకు నాటకీయంగా తీర్చిదిద్దడం వీరి ప్రత్యేకత మునివేషంలో వచ్చి తన్ను పరిణయమాడుమని ప్రార్థిస్తున్న రావణునితో సీత ఆతనికి రామునికీగల అంతరం ఎంతటిదో ఇలా పేర్కొంటుంది

| | |
|---|---|
| బంగారమునకు | ఆసీసమునకు |
| రాజహంసకు | రాబందునకు |
| మృగరాజానకు | మార్జాలమునకు |
| ఎంత అంతరము | అంతయున్నది |
| నారామునకు | నీకురావణా |
| మహాభాగుడు | మహాతేజుడు |
| అగురామునిసతి | నన్ను కోరుకొని |
| సర్వనాశనము | బొందకునీవలె |

గానసుధాబంధురంగా పరవశరమణీయంగా అరణ్యకాండను రచించిన ''గానకళానిధి'' ''కళారత్న'' శ్రీ పంతుల లక్ష్మీనారాయణరావుగారు సర్వజనసమభినంద్యులు పాఠకులు గాయకులు ఈ రామాయణగానసుధని ఆస్వాదించి తరింతురుగాక

శుభం భూయాత్

**ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి**
ఎం ఎ ,పి హెచ్ డి (తెలుగు)
ఎం ఎ ,పి హెచ్ డి (సంస్కృతం)
తెలుగుశాఖ
ఆంధ్రవిశ్వకళాపరిషత్, విశాఖపట్నం-3,

# నా గురించి

**కీ॥శే॥** ' **సహజకవి పంతులచినజోగారావు కీ॥శే॥ సుభద్రమ్మల** పదకొండుమంది సంతానంలో నేను మూడవ వాడిని పంతులవారి వంశపూర్వజులలో పార్వతీపురం జమీందారు ధనంజయుధాత్రారాజుగారి ఆస్థానంలో "**కవిసార్వభౌమ**" బిరుదుసత్కారం పొందిన "**ఇందుమంతీపరిణయం**" శృంగారప్రబంధకర్త **పంతులు బ్రహ్మదేవకవి** మా తండ్రిగారికి స్ఫూర్తి నా తండ్రిగారు "**శ్రీమద్రామాయణపారిజాతం**" అను నిర్వచనోత్తర రామాయణమును రచించి దానిని **శ్రీ భద్రాద్రి రామచంద్రులవారికి** అంకితముగావించి, వారి జన్మచరితార్థము జేసికొని, వారి సంతతిని పునీతుల్ని జేసినారు

చిన్నతనంలో మా తండ్రిగారు నాచేత క్షుణ్ణంగా "పెద్ద బాలశిక్ష", అనేక కవులు వ్రాసిన శతకాలు చదివించారు కాస్త జ్ఞానం వచ్చాక మా తండ్రి గారి పుస్తక భాండాగారంలో నున్న అనేక గ్రంథాలు చదివే అవకాశం నాకు కలిగింది క్రమేపి తెలుగునుడికారం మీ్మదమక్కువ ఎక్కువయింది ఈ మక్కువేనన్ను విద్వాన్ శ్రీ దివాకర్లరామమూర్తిగారికి, ఉభయ భాషా ప్రవీణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిగారికి, శ్రీచర్ల గణపతి శాస్త్రి గారికి, "కళాప్రపూర్ణ" గణపతిరాజా అచ్యుతరామరాజుగారికి "కవిశేఖర" శ్రీ కొండేపూడి సుబ్బారావుగారికి దగ్గరచేసింది వారి అవ్యాజమైన ప్రేమాశీస్సులు పొందగలిగే అవకాశం కలుగ జేసింది

3 నా 7సం॥ల వయస్సులో గానగంధర్వ, పద్మశ్రీ ఘంటసాల గారు "లైలామజ్ను" చిత్రంలోపాడిన

''పయనమయే ప్రియతమ నను మరచిపోకుమా'' అనేపాట నా హృదయంమ్మీద చెరగని ముద్రవేసి అతనికి ఏకలవ్యశిష్యునిగా జేసింది నాకు గానం మ్మీదగల మక్కువ జూసిన నా తల్లిగారు నన్ను అమితంగా ప్రోత్సహించేవారు ఈనాడు 44 సం॥రాలుగా లలితసంగీత గాయకునిగా వెలుగొందడానికి ప్రోత్సాహించిన నా తల్లిగారికి, తెలుగులోని కమ్మదనాన్ని ఆస్వాదింపజేసిన నా తండ్రిగారికి, నన్ను కవిగా తీర్చిదిద్దిన నా గురువులందరికీ నేను ఎంతో ఋణపడి ఉన్నాను

నేను మొట్టమొదటిసారిగా **ఆగష్టు 15, 1956న** పోర్టు జింఖానా దగ్గర కచేరీ చేశాను ఆ తరువాత **1958 అక్టోబరు** నెలలో అంతర్ కళాశాల పాటలపోటీలో ఉత్తమగాయకునిగా ఎన్నికకాబడి అంతర్విశ్వవిద్యాలయాల యువజనోత్సవాలలో పాల్గొనుటకు ఢిల్లీవెళ్ళి నాటి భారత ప్రధాని **పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ బాబూ జగజ్జీవన్‌రామ్, బూర్గుల రామకృష్ణారావు** మున్నగు ప్రముఖులముందు గానంచేసి వారి ఆశీస్సులు అందుకున్నాను తిరిగి 1968వ సంవత్సరంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంనుండి ఉత్తమ గాయకునిగా ఎన్నికకాబడి, ఢిల్లీలో జరిగిన కామన్‌వెల్త్ దేశాల యువజనోత్సవాలలో పాల్గొని నాటి **రాష్ట్రపతి శ్రీ వి వి గిరి** వారి సతీమణి శ్రీమతి సరస్వతీగిరి, వారి కుమారులు శ్రీ శంకర్‌గిరి మరికొంతమంది ప్రముఖులముందు రాష్ట్రపతి భవనంలో పాడివారి అవ్యాజమైన ప్రేమకు నోచుకున్నాను నాటినుండి నేటివరకు ఈ 44 సంవత్సరములలో పలు ఆర్కెస్ట్రాల సహకారంతో ఆంధ్రలోను, ప్రవాసాంధ్ర ముఖ్యపట్టణములలో **3500**పై చిలుక లలిత సంగీత కచేరీలు చేసే అదృష్టానికి నోచుకున్నాను

1982లో ఉద్యోగరీత్యా నాకు కొన్ని చికాకులు ఎదురై జీవితంమ్మీద విరక్తి కలిగినపుడు, ఒక మిత్రుని సలహాపై **శ్రీ ఆంజనేయస్వామి**వారి పాదాలను ఆశ్రయించాను నాటినుండి

ఆయనే నా ఆరాధ్యదైవం, ఆయనే తల్లి, తండ్రి, గురువు స్వామి వారి ఆదేశమెూ, మహిమెూ ఒకరోజు **శ్రీ సీతారాములకళ్యాణఘట్టాన్ని** గానరూపంలో వ్రాయగా, అది చదివిన వారు నన్ను ప్రోత్సహించి మొత్తం రామాయణాన్ని గాన రూపంలో వ్రాయమని సలహానిచ్చారు అది మొదలు ముఖ్యంగా నాతండ్రిగారు రచించిన ''**శ్రీ రామాయణపారిజాతం**''ను ఆమూలాగ్రం పఠించి ముందుగా శ్రీ ఆంజనేయ స్వామివారి కృపాకటాక్షవీక్షణాలకు పాత్రుడనవాలని తలచి సుందరకాండము ''**శ్రీపావని సుందరగానసుధ**'' అన్న పేరుతో వ్రాసి, ముద్రించి, పాఠకలోకానికి అందించ గలిగాను నేను రాసిన సుందరకాండను, నేనే గానంచేసి క్యాసెట్టుగా విడుదలచేసే మహాద్భాగ్యాన్ని కలుగజేసారు నా సుందరరూపుడు అంజనిసుతుడు

ఏనాడు సుందరకాండను పూర్తిచేసి, గానం చేశానో నాటినుండి నాకష్టనష్టాలన్నీ మటుమాయం అయ్యాయి జీవితంలో నేను చేపట్టలేనన్న కార్యక్రమాలనీ సునాయాసంగా జరగటం మొదలయ్యాయి ''**అసాధ్యస్సాధక స్వామిన్, అసాధ్యం తవకింవద, రామదూతకృపాసింధో మత్కార్యం సాధయప్రభో**'' అని పఠించి స్వామివారిని మనసా, వాచా, కర్మణా నమ్మినవారికి అన్ని జయాలే అపజయాలు చవిచూడరని నా నమ్మకం వ్యాకరణంగాని ఛందస్సుగాని క్షుణ్ణంగా రాని నేను రామగానాన్ని వ్రాయటానికి నిస్సందేహంగా అనర్హుడను కాని స్వామివారి ఆశీస్సులతోనే శ్రీరామగానాన్ని వ్రాయగలిగేశక్తిని సంపాదించుకున్నాను, దానికి తోడు నిరంతరం నాకన్నా ఎక్కువగా భక్తి ప్రపత్తులతో శ్రీమారుతిని కొలిచే నాసహధర్మచారిణి **చి॥సౌ॥ గిరిజ** నాకు మనోబలాన్ని సమకూర్చి, మిగిలిన బాల, అయోధ్య అరణ్య, కిష్కింధ, యుద్ధ కాండములు వ్రాయగలిగేటందుకు శతవిధాల దోహదపడింది ఈశ్వరాంశ సంభూతుడైన శ్రీ ఆంజనేయస్వామివారు,

తననునమ్మిన వారికి, కొలిచేవారికి, సుందరకాండ పారాయణజేసేవారికి, విద్యా, వినయాదులతో బాటు సకలైశ్వర్యాలు కలుగజేస్తాడన్నది నిత్యసత్యం

ఈ పుస్తక ప్రచురణకు ఇతోధికంగా ధన సహాయము చేసిన నా అల్లుడు చి॥ **డి వి సుబ్రహ్మణ్యకుమార్‌కు**, నా కుమార్తె చి॥సౌ॥ **పద్మశ్రీకి**, మనుమరాలు చి॥ **అనిలామధులికకు**, మనుమడు చి॥ **సాయిమనోజ్‌కు** ఆ పావనపావని ఆయురారోగ్య ఐశ్వర్యములు సమకూర్చుగాక

అదేవిధంగా ఈ పుస్తక ప్రచురణకు ధనసహాయము అందజేసిన **శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం**, తిరుపతివారికి నా ధన్యవాదములు

ఈ అరణ్యకాండను అతి తక్కువ వ్యవధిలో ముద్రించిన శ్రీ శర్వాణి ప్రింటర్స్ వారికి, శ్రీ ఎమ్ ఆర్ ఎల్ రావుగారికి, శ్రీ సత్యశ్యాంగారికి, పీఠికవ్రాసిన ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి నా కృతజ్ఞతాభివందనాలు

భక్తిభావంతో వ్రాసిన నా ''**శ్రీ రామాయణగానసుధ**''ను చదివిన బుధులు తప్పులున్న ఒప్పులుగాగొని వారి ఆశీస్సులు అందజేయగలరని ఆశిస్తున్నాను నాశేష జీవితాన్ని ''**శ్రీరామగానం**''తో పునీతం చేసుకోవాలని, నా ఆకాంక్ష ఆపై స్వామివారికృప

ఓం శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ఓం శ్రీ పవనతనయాయనమః

''కళారత్న''

**పంతుల లక్ష్మీనారాయణరావు**

# శ్రీరామాయణ గానసుధ

## (అరణ్యకాండము)

### శ్రీరామచంద్రుడు దండకాటవిని ప్రవేశించుట

1 శ్రీరఘురాముడు - కోదండమునిడి
అనుజుడు సీతయు - అనుసరించగా
అడుగిడె దండక - కాననమందున
దినకరుడులేని - దివసమువోలె
అగుపించెను ఆ - కారడవంతయు
దరిలోగాంచెను - దశరథరాముడు
పూలతరువుల - ఫలవృక్షముల
అలరెడు సుందర - ఆశ్రమ మొకటి
2 రాముని రాకను - శిష్యులు తెలుపగ
ధర్మచారులు - దివ్యజ్ఞానులు
కడుముదంబున - రాముని జేరి
ఆహ్వానించిరి - ఆశ్రమంబునకు
భక్తిభావమున - కరములు మోడ్చి
రామునిగాంచి - ఇటులపలికిరి
ఆదిపురుషుని - రూపంబునుగొని
జనియించితివీ - ధరణియందునా

3. నీవెన్నపుడవు - శాసకుండవు
నీసన్నిధి మా - స్వర్గధామమని
విన్నవించు ఆ - మునులనుగాంచి
వారడిగిన శా - స్త్రార్థములన్నియు
కడురీతిని వి - వరించిచెప్పెను
వేకువఝామున - వేదమూర్తులు
వేయివిధంబుల - ఆశీస్సులునిడ
పయనమాయెను - పరంధాముడు

## రామలక్ష్మణులు విరాధుని గాంచుట

4 అటులేగెడి ఆ - రామలక్ష్మణులు
ఘోరారణ్యపు - నడుమభాగమున
ఘోరాకారుని - ఘోరజిహ్వుని
మహాక్రూరుని - మహాశూరుని
వికృతనేత్రుని - వికటాకారుని
కడుభీభత్సుని - కల్మశభోజుని
హస్తిశిరము శూ - లాగ్రము నుంచి
బొబ్బలిడెడి ఒక - రక్కసునిగనె

5 సీతారాముల - సౌమిత్రినిగని
దుష్టదనుజుడు - రయమునవచ్చి
సతిజానకిని - కేలను బట్టి
తన అంకమున - ముదమున జేర్చి
మీరలెవ్వరీ - కాననమందున
జటలు ధరించి - కోదండములను
కరములనిడుకొని - కాంతను జేకొని
క్రొవ్వినవారై - తిరుగు చుంటిరి

6 నే విరాధుడను - వినలేదేనను
మహాశూరుడను-మహిమాన్వితుడను
ఈ కారడవికి - నేనే ప్రభుడను
మీ నరమాంసము - నే భుజియించెద
పెండ్లి యాడెదను - ఈ హరిణాక్షిని
అనిన పలుకులు - వినినజానకి
హోరుగాలికి - ఊగిసలాడెడు
కదళీకాండము - వలె కంపించెను

7. అతుల వణకెడి - సీతనుజూచి
గంటివెలక్ష్మణ - భవ్యచరితను
మనజనకుని - మరణంబు కంటెను
అయోధ్యారమా - హరణము కంటెను
మాతకైకేయి - వరములకంటెను
నిజసతి సీతను - అన్యుడంటుట
ఘనతరంబగు - దుఃఖకారణము
అని పలికెను ఆ - రఘునందనుడు

8. అటు తపించెడి - అనుజుని గాంచి
చాపమునెత్తి - శరపరంపరల
దనుజుని గుండెను - ముక్కలు జేసెద
కైకసుతునిపై - పుట్టినకోపము
ఈ దనుజునిపై - ప్రయోగించెద
అనిపలికెడి - ఆ లక్ష్మణుగాంచి
మీరలెవ్వరు - ఎటకేగెదరు
అనిప్రశ్నించెను - ఆ విరాధుడు

9. దశరథేశుని - సుతులముమేము
కడు క్రూరులగు - దితి తనయులను
తుదముట్టింపగ - తిరుగు చుంటిమి
నీవెవ్వడవీ - వనమునందున
ఒంటిగ నేలా - తిరుగుచుంటివి
అని ప్రశ్నింపగ - రక్కసుడిటులనె
నా జనకుండు - జనుడనువాడు
జననిశతప్రద - నే విరాధుడను

10 ఘోరతపముచే - నలువమెప్పించి
శస్త్రాస్త్రమ్ముల - మృతి లేకుండగ
వరముబడసితిని - కావున మీకు
ప్రాణముమీద - ఆశయున్నచో
ఈవనితనుమీ - రిచ్చటవిడచి
కడుయధేచ్ఛగా - ఏగవచ్చునన
మృత్యువునీకా - సన్నమాయెనని
రాముడు పలికె - రుద్రమూర్తియై

11 రామలక్ష్మణులు - శరవర్షమ్మును
కురిపించిరి ఆ - క్రూర దనుజుపై
తనశూలంబున - ఆ శరములను
త్రిప్పికొట్టెను - ఆ విరాధుడు
ధరణీసుతను - ధరణిన విడచి
గరుడుడు నాగుల - పట్టినరీతిగ
ధనుజాధిపుడు - రామలక్ష్మణుల
కేలగైకొని - మింటికెగసెను.

12 అంబరవీధిని - రక్కసుగాంచి
భయకంపితయై - జానకి ఇటులనె
కడుక్రూరంబగు - వన్యమృగంబులు
నన్నుమ్రింగును - అడవి యందున
సత్యవ్రతుడగు - నాపతిరాముని
పుత్ర సమానుడు - మరది లక్ష్మణుని
వీడుమునీవు - నన్ను మ్రింగుము
నీకు మ్రొక్కెదను - ఓదనుజోత్తమ

13 ధరణీపుత్రిక - ఆర్తనాదములు
వినినవెంటనే - రామలక్ష్మణులు
జాగుచేసిన - సీతదక్కదని
రక్కసు జంపగ - నిర్ణయించుకొని
వామభుజము - సౌమిత్రి ద్రుంచగ
కుడి భుజమును-శ్రీ రాముడు ద్రుంచగ
దుష్ట విరాధుడు - గావుకేకలిడి
మహానగమువలె - ధరణిని గూలె

14 దనుజానంతట - రామలక్ష్మణులు
శరములపొడిచి - కడుహింసించెను
తడవతడవకు - మీదకు ఎత్తి
కొండబండపై - బాదె విరాధుని
ఎన్ని జేసినా - దుష్టరాక్షసుడు
చావకుండుట - గాంచిన రాముడు
బిలమునవీనిని - పూడ్చిన గాని
యమపురికరుగడు-అనె సౌమిత్రిని గని

15. రామునిపలుకులు - ఆలకించిన
ఆ విరాధుడు - కడుదీనముగా
కౌసల్యాసుత - ఓ కరుణాత్మ
శ్రీ రఘురామా - ఎరిగితి తండ్రి
ఈ సాధ్వీమణి - సతి సీతయని
నీ సోదరుడు - సౌమిత్రియని
ఇంతవరకు - నేఅజ్ఞానంబున
ఎరుగనైతిని - నను మన్నింపుము

16 పూర్వమునేనొక - గంధర్వుడను
తుంబురుండను - పేరిటివాడను
క్రమముతప్పి - నే రంభనుగూడగ
అలకాధిపతి - అగ్నిహోత్రుడై
శాపమిడెను నను - రక్కసుగమ్మని
శాపవిమోచన - మార్గముకోరగ
శ్రీరఘురాముడు - నినువధియింపగ
పొందెదవీవు - తొల్లిటి రూపనె

17. నాటినుండి నే - ఇటవేచితిని
నీకొరకైనే నె - దురుజూచితిని
నేటికినాపై - నీదయకలిగి
నాదుశాపమును - బాపితివీవు
శలవిచ్చినచో - చేరెదనాకము
అర్ధయోజనము - మీరువెడలిన
బ్రహ్మజ్ఞానకృ - తాంతరంగుడగు
శరభంగుండను - మునిపుంగవుని
ఆశ్రమంబును - వడివడిచేరిన
కడుక్షేమంబగు - మీముువ్వురికనె

## రాముడు శరభంగాశ్రమము జేరుట

18 ఆ విరాధుని - కోరిక మీరకు
ఆ వనంబున - లక్ష్మణుడంతట
కరికి సరిపోవు - బిలమును త్రవ్వగ
శ్రీరఘురాముడు - ఇరుకరములతో
ఎత్తి విరాధుని - త్రోసె బిలమున
కటికశిలలచే - బిలమును గప్పి
దుర్గమమగు ఆ - వనమును విడచి
ముప్వురేగె శర - భంగునిజూడగ

19 సురగంధర్వులు - సిద్ధులు ఋషులు
సురపతి గూడి - అభినందించుచు
శరభంగునితో - సంభాషించుట
రామలక్ష్మణులు - గాంచె ముదంబున
రామాగమనము - ఎరిగిన సురపతి
గ్రక్కునతాను - రథారూఢుడై
శరభంగునిదరి - శపుగైకొని
అమరధామము - అరిగె రయమున

20. రామలక్ష్మణులు - సతిసీతయును
మునిశరభంగుని - పాదములంటి
ఇంద్రునిరాకకు - కారణమడుగ
ఓదాశరథీ - నేతపంబున
బ్రహ్మలోకమును - సముపార్జించితి
ననుగొనిపోవగ - సురపతి వచ్చెను
అధికప్రియుడవగు - నినుదర్శింపక
సత్యలోకమును - ఏ విధిచేరుదు?

21. రాముడడిగె - వనవాస యోగ్యమగు
అనుగుప్రదేశము - ఆనతీయుమని
సుతీక్ష్ణుండను - మునిపుంగవుని
చేరుకొనిన నీ - కోరికతీరును
ఉరగము కుబుసము - విడిచిన రీతిని
దేహమువీడెద - ఈక్షణమందే
గాంచిపోగుము - దశరథనందన
అనిపలికెను - శరభంగుడంతట

22. మంత్రమ్ములతో - అనలముజేసి
ఆజ్యముబోసి - ప్రకాశింపగా
మునిశరభంగుడు - ముకుళిత కరుడై
అనలమునబడి - భస్మమొందెను
సొంపగు రూపుతో - బయిటకు వచ్చి
స్వర్గధామమును - దాటిన పిమ్మట
సత్యలోకమున - పితామహునిచే
గౌరవమొప్పగ - స్వాగతంబుగొనె

**శ్రీరాముడు వాలఖిల్యాదిమునులను దర్శించుట.**

23. సీతారామా - సౌమిత్రులకు
మార్గ మధ్యమున - వాలఖిల్యాది
మునులందరు - శ్రీరామునిజేరి
చిత్రకూటగిరి - సానులయందు
చిరకాలముగా - వాసముజేసెడి
మునివరులను - కడుచిత్రహింసలు
గావించెడి ఆ - రక్కసిమూకల
తుదముట్టింపగ - శరణువేడిరి

**శ్రీరాముడు దండకావనిలో మునులకభయమిచ్చుట.**

24 మునులబాధను - వినినరాముడు
జననికైకేయి - జనకునానతిని
ఆసరగాగొని - ఆత్మకార్యమున
ఏగుదెంచితి - కారడవులకు
రక్కసిమూకల - రణమునగూల్చి
మీకానందము - నేనొసగెదను
అని శ్రీరాముడు - మునులకభయమిడి
ముందుకుసాగెను - మునిసుతీక్ష్ణుగన

**రాముడు సుతీక్ష్ణాశ్రమము జేరుట**

25 మునివాటికను - జేరిరాముడు
ఓ మునివర్యా - నే రాముడను
మీదర్శనము - జేయగవచ్చితి
అనితనడనికిని - తెలుపగాముని
వింటినిరామా - రాజ్యభ్రంశము
ముని రూపమును - నీవు గొనుటయు
చిత్రకూటమున - సీతాసాధ్వితో
తమ్మునితోడ - నీవుండుటయు

26. తమ్మునితోడ - భార్యసీతతో
వచ్చుచుంటివని - తెలుసుకొంటిని
నినుమనసారగ - గాంచుటకొరకై
వేయికనులతో - వేచియుంటిని
అని సుతీక్ష్ణుడు - పలికిన వెంటనే
మే ముప్పురము - వాసముండుటకు
అనుగుప్రదేశము - శలవిచ్చినచో
మేము గడిపెదము - కాననవాసము

27 అటులడిగెడి - రఘురాముని జూచి
కడుపావనము - ఈ ఆశ్రమము
సతతముఫలములు-దండిగ దొరకును
తాపసోత్తముల - దినచర్యలను
క్రూర మృగమ్ములు -భగ్నముచేయును
వాటిని దునుమ - వ్యధనొందెదవు
అదియొతప్ప - భయమేమిలేదని
తన సందియము - తెలిపె రామునికి

**సీతరామునికి శస్త్రధారణదోషము తెలుప**
**శ్రీరాముడు సాదుజనరక్షణ కర్తవ్యమని చెప్పట**

28 మునులందరు - శ్రీరాముని జేరి
నీశరములచే - క్రూరమృగములను
నిశాచరులను - తుదముట్టించి
మునివాటికలను - రక్షింపుమన
వారికభయము - ఒసగె రాముడు
అది విని జానకి - ఎంతయొువగచి
శస్త్రసాంగత్య - దోషము తెలిపి
ఆశ్రమధర్మము - పాటించమనె

29 అడవులయందు - కందమూలముల
భుజియించుచు - కడు ధర్మపద్ధతిని
కాలముగడిపెడు - మునిజనంబుల
కడునిర్ధయులై - వధించుచున్న
నిశాచరులను - తుదముట్టించుట
ఏ రీతిగనగు - అధర్మపద్ధతి
ఆర్తరక్షణ - పరమధర్మమని
అవనీజాతకు - జెప్పెరాముడు

**దర్మభృతుండను మునిపుంగవుడు మాండకుని గురించి తెలియజెప్పను.**

30 మునిజనంబులు - వెంటనడువగా
సీతారామాల - క్ష్మణాదులు
చనిచనిదవ్వున - డంబము మీరగ
ఒక యోజనము - పరిమితి కలిగిన
శుభకరమగు - తటాకముగనెను
ధర్మభృతుండను - మునిపుంగవుగని
జనసంచారము - లేని ఈస్థలిని
కర్ణపేయముగ - తంత్రీ స్వనములు
నీటనుండి ఎటు - వినపడు చున్నవి
వివరముగా వి - శదీకరింపుమని
రాముడుకోరెను - ధర్మభృతునిగని

31 దీనినామము - పంచాప్సరము
మాండకర్ణియను - మునిపుంగవుడు
పెంపువహింపగ - నిర్మించెనుఇట
పదివేలేండ్లు - పరమనిష్ఠతో
గాలిభుజించి - తపముచేయుగా
వహ్నిచెలరేగ - వేల్పులుభయపడి
విఘ్నమొనరించ - పంచాప్సరలను
ఎఱగా బంపిరి - మునివరుకడకు

32 అచ్చరకాంతల - తావరియించి
తటాకంబున - అంతర్హితమగు
ఒక సౌధంబును - అటనిర్మించి
కాంతలగూడి - కడుయథేచ్ఛగ
విహరించెడి ఆ - సమయమందున
ఆ భరణమ్ములు - వచ్చెడి రవళి
తంత్రీస్వనముగ - ఈ విధి మనకు
కర్ణములకిపుడు - సోకుచుండెనని

33 హోమములు సలుపు - మునివరోత్తముల
మంత్రరవంబులు - వినుచు రాముడు
మునివరులొసగెడి - ప్రతి పూజలు గొని
దినదినమున కొక - మునివాటికగని
గాంచుచుసాగెను - దండకాటవిని
దశవర్షమ్ములు - గడపిన పిదప
సీతాలక్ష్మణ - సహితుడైవెడలె
సుతీక్ష్ణమునివరు - జూడ రాముడు

**అగస్త్యునాశ్రమముగూర్చి రాముడడుగుట**

34. ఈ వనమందు న - గస్త్య మునీంద్రుని
ఆశ్రమమొకటి -కలదని వింటిని
దానినిజేరెడి - మార్గము మీరు
తెలియజేయుడని - రాముడడుగగా
దక్షిణదిశగా - నాల్గుయోజనము
లేగితివేని - అగస్త్యుని తమ్ముని
ఆశ్రమంబును - చేరుకొందువు
నాటిరేయినీ - వటనిద్రింపుము

35 వేకువఝామున - దక్షిణదిశగా
తిరిగి ప్రయాణము - జేసితివేని
జేరెదవీవు - అగస్త్యాశ్రమము
మహితంబైన - వనములయందు
ధరణీసుతను - లక్ష్మణుగూడి
జేరిసుఖింపుము - అనిదీవింపగ
మునివచించిన - త్రోవనుగైకొని
మువ్వురేగిరా - కాననమందున

**రాముడు వాతాపీల్వలుల గురించి చెప్పట**

36. మార్గమధ్యమున - వనమును జూపి
దనుజసోదరులు - వాతాపీల్వలు
మునుపీవనమున - వాసముంటిరి
బ్రాహ్మణరూపము -గొని యిల్వలుడు
ఓ ద్విజులారా - మాగృహమందు
శ్రాద్ధము నేడు - సర్వసిద్ధము
వచ్చిభుజించి - కృతార్థుజేయుడని
కడు వినయమ్ముగ - పిలిచెడివాడు

37 తమ్ముడైనవా - తాపినప్పుడ
మేషరూపునిగ - మార్చి వధించి
భూసురులకుతా - కుడువగ బెట్టి
ఉదరములువారు - నిమురుకొనియెడి
సమయంబున - వాతాపి రమ్మని
ప్రీతిగపిలచిన - తదుపరి క్షణమున
పొట్టలు చీల్చుచు - మేషాకృతితో
వాతాపి బయటకు - వచ్చెడివాడు

38. విగత జీవులగు - బ్రాహ్మణోత్తముల
రాబందులవలె - దనుజులిద్దరు
వంతులబడి - భక్షింపసాగుచు
సంతోషమ్ముగ - కాలము గడపిరి
ఒక దినంబున - ముని అగస్త్యుని
పిలచి యిల్వలుడు - తొల్లి చందమున
వాతాపిని జంపి - మాంస ఖండముల
పచనము జేసి - వడ్డనజేసెను

39. కలశశూనుడు - కడుముదంబున
హస్తోదకము - జేసిన పిమ్మట
వాతాపి జీర్ణం - బని అనుకొని
ఉదరము ఒకపరి- నిమురు కొనియెను
అది ఎరుగని ఆ - యిల్వలు డప్పుడు
వాతాపి ఇక - రమ్మని పిలువ
నా జఠరాగ్నిదహి - యించి యిల్వలుని
యమపురి కంపె - అనెను అగస్త్యుడు

**రాముడు సుదర్శుని ఆశ్రయమంబు జేరుట**

40. అనుజాని మరణము - విని ఇల్వలుడు
పటు రోషమ్మున - మునిపై బడగా
తనదృష్టులచే - అగ్నిరగిల్చి
అందు యిల్వలుని - భస్మముజేసి
రక్కసులగు - వాతాపియిల్వలుల
భయమును బాపి- మునులను బ్రోచిన
కలశసంభవుని - అనుజాసుదర్శుని
ఆశ్రమ మిదియని - రాముడు పలికెను

**శ్రీ రాముడు అగస్త్యాశ్రమంబు జేరుట**

41. మునిసుధర్మని - ఆశ్రమంబున
అతిథిసేవలు - గొని శ్రీరాముడు
భానోదయమ్ము - అయినవెంటనే
ముని ఆనతిగొని - బయలుదేరెను
అగస్త్యాశ్రమము - జేరినవెంటనే
తన ఆగమనము - తెలియబరచగా
ముని ముదమ్మున - రఘునందనుని
కడు వేగమ్ముగ - తోడ్కొని రమ్మనె

42 శివుని స్థానము - విష్ణు స్థానము
శుక్ర దివాకర - స్థానమ్ములను
పద్మారిస్థానము - భగుని స్థానము
ధనధుదాత - విధాత స్థానములు
నలుని స్థాన - మనంతుని స్థానము
గాయత్రి స్థానము - వసువుల స్థానము
వరుణుని స్థానము - స్కంధుని స్థానము
గాంచుచుపగిరి - ఆశ్రమమందున

43. ముని వర్యునకు - మువ్వురు మ్రొక్కగ
రాజువు నీవు - సర్వజగములకు
మహారథుడవు - మాన్యమూర్తివి
ధర్మవర్తివి - రాజితకీర్తివి
పూజకునీవు - పూర్ణయోగుడవు
కాననమందు - మునివలె తిరిగెడి
నీకు శుభంభగు - నెల్లవేళలా
అని మునివరు డా - శీస్సులొసగెను

అగస్త్యుడు రామునకు వైష్ణవాస్త్రంబు నిచ్చుట

44 అటుపిమ్మట - రఘురాముని గాంచి
విశ్వకర్మచే - నిర్మితమైనది
దివ్యమహిమలు - కలిగినట్టిది
హేమమణులతో - పొదగబడినదగు
వైష్ణవధనువు - తుణీరములు
నీదరినున్న - జయమగు నీకని
వైష్ణవాస్త్రమును - రామునికీయగ
రాముడు ముదమున - స్వీకరించెను

**అగస్త్యుడు రామునకు పంచవటి వాసయోగ్యమని చెప్పుట**

45 నీటివనరులు - నిండుఫలములు
దండిగ నుండు - తావులందున
గడువుతీరగా - నుండ దలచితిమి
అవలోకించి - ఆజ్ఞ నొసగుడు
అని పలికినశ్రీ - రాముని కనుగొని
వాస యోగ్యము - పంచవటి సీమ
ఏగుము రఘువర - పరమానందము
పొందెదవీవని - దీవెన లొసగెను

**శ్రీ రాముడు జటాయువును జూచుట**

46 మార్గమధ్యమున - మహాకాయుడగు
విహగరాజును - గాంచెను వారు
కపటరూపియగు - దనుజుడనుకొని
ఎవ్వడవీవని - రాముడడుగగా
దశరథేశ్వరుని - ప్రియ మిత్రుడను
నామధేయము - జటాయువనగా
కడుముదంబున - రఘునందనుడు
ఆ పక్షీంద్రుని - అక్కున జేర్చెను

47 భూతసృష్టికి - బీజభూతులగు
ఆ ప్రజాపతుల - వంశక్రమమును
అటుపిమ్మట ఈ - సృష్టిక్రమమును
తగురీతిని రఘు - వరునకు దెలిపి
మీరిచ్చట వసి - యించుసమయమున
కందమూలముల - కేగెడి వేళ
ఒంటిగ నుండెడి - పృధివీసుతకు
రక్షణగా నే - కాపుండెదనని

**రాముడు లక్ష్మణునితో పర్ణశాల నిర్మింపుమని జెప్పుట**

48. గలగల పారెడి - గోదావరిని
గాంచి నంత ను - ప్పొంగిరి ముప్పురు
మిట్టపల్లములు - లేని ధరణిపై
పర్ణకుటీరము - నిర్మింపుమని
రఘురాముడు - సౌమిత్రికిజెప్పి
ఇట సోదరుడు - పక్షివిభుండును
తోడుండగ నివ - సించుటమేలని
సీతనుగాంచి - పలికెరాముడు

## శ్రీరాముడు పర్ణశాల ప్రవేశించుట

49. భూమిని త్రవ్వి - పునాదులువేసి
కడు నేరుపుతో - గోడలుబెట్టి
వెదురుబొంగు - కంబములనమర్చి
జమ్మికలప - వాసాలనమర్చి
పచ్చివెదురులు - నడుమనుబెట్టి
నారతాళ్లతో - ముడులుబిగించి
బోదరెల్లును - ఇంపుగగప్పి
పర్ణశాల ని - ర్మించె లక్ష్మణుడు

50. గౌతమియందు - స్నానము జేసి
ఫలపుష్పములను - త్వరగా దెచ్చి
శాంతికార్యములు - శాంతముజేసి
రాముని రమ్మనె - అతి వినయముగ
సీతేశుడు ఆ - నంద భరితుడై
ఘనమతి లక్ష్మణ - ఈ కార్యమునకు
పారితోషికము - ఏమీగలను
అని లక్ష్మణుని - అక్కున జేర్చెను

**శూర్పణఖ రామునిపై మరులు గొనుట**

51 భార్యసీతయును - భ్రాతలక్ష్మణుడు
తగురీతుల - సపర్యలు సలుపగ
ఇనకులతిలకుడు - ఆనందముగా
దినములుగడిపె - పంచవటి దరి
ఒకదినమున - లంకేశుసోదరి
రామునిగాంచి - మరులురగులగా
దవ్వులజేరి - నిజసతితోడ
ఏలవనంబున - వసియించుదువని

52 తన చరితము - రఘురాముడు చెప్పి
రక్కసివోలె - గోచరించెడి
నీ ఉనికెయ్యది - ఎవ్వరిదానవు
ఇచ్చటికేలా - నీవొచ్చితివన
దనుజనాయకుడు - రావణాసురుని
సోదరినేను - శూర్పణఖందురు
తోబుట్టువులు - ఖరదూషణులు
కడు నిర్దయులు - యుద్ధవీరులు

53. ఓమహీశ నను - ఏమనుకొంటివి
నిన్నుగాంచిన - మరుక్షణమందున
మనమున మగనిగ - కోరుకొంటిని
నీ సతిసీతను - అనుజ లక్ష్మణుని
ఈ క్షణమందే - నేమ్రింగెదను
కావున నీవు - నా మగండవై
విహరింపుము ఈ - గహనభూముల
అనె శూర్పణఖ - రామునితోడ

54. చిరునగవుల దను - జాంగననుగని
మృదువచనమ్ముల- రాముడులిటులనె
ధర్మపద్ధతిని - పరిణయమాడిన
నిజసతి సీతను - ఎటు విడనాడుట
అటుగాకున్న - కడుసుందరివగు
నీకుగలుగు - సవతాలి పోరని
తనతో సముడగు - తేజోవంతుడు
అనుజలక్ష్మణుని - అడుగ బంపెను

55 మరుశరమ్ములకు - జిక్కి శూర్పణఖ
లక్ష్మణుజేరి - సరసపుమాటల
తననుభార్యగా - స్వీకరింపుమన
శ్రీ రఘురాముని - బంటునునేను
బానిసీడను - నిను పెండ్లాడిన
నీవు బానిసవు - అగుదువోచెలి
తిరిగి రాముని - గోరితివేని
సీతనువెట్టి - నిను జేకొనునని

56 సుమిత్రసుతుడు - పలికిన పలుకులు
పరిహాసమ్మని - ఎరుగక రక్కసి
పటురోషమ్మున - రామునిజేరి
సీతతోగూడి - నీవుండుటచే
నాకు గౌరవము - నీయకుంటివి
ఈ నిమిషమ్మున - సీతను మ్రింగి
సవతి పోరు - లేకుండగ జేసి
నిన్నుగూడి నే - సుఖియించెదనని

**లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు, చెవులు గోయుట,**

57 పగగొని రక్కసి - జానకిపై బడ
అతి బలశాలి - రాముడప్పుడు
ఇరుకరములతో - రక్కసిబట్టి
మదియించిన ఈ - దనుజకాంతను
తగురీతిని శి - క్షింపుములక్ష్మణ
అని ఆనతిని - రాముడీయగా
ఖడ్గముబూని - ముక్కుచెవులను
కోసెలక్ష్మణుడు - ఉగ్రమూర్తియై

**శూర్పణఖ సీతారామలక్ష్మణుల గురించి ఖరదూషణులకు ఎరింగించుట**

58 ముక్కలు వోయిన - ముక్కుచెవులతో
రక్తముకార - వికారరూపియై
ఆర్తనాదమును - జేయుచు చేరెను
తన అనుజాలుఖర - దూషణాదులను
వికృతరూపమున - ఉన్నసోదరిని
గనిన ఖరుడు ఆ - గ్రహమును పొంది
ఈ విధినిను హిం - సించినవాడు
ఎవడో చెప్పుము - నేలగూల్చెదనె

59 తరుణరూపులు - తాపసివేషులు
సౌకుమార్యులు - వల్కలధారులు
ధర్మశాలురు - అతిసుకుమారులు
వన్యమూలఫల - భక్షులువారలు
దశరథసుతులు - రామలక్ష్మణులు
వారినడుమగల - నారీతిలకము
కారణంబుగా - ఈ గతిపొందితి
అనుచువగచె ఆ - శూర్పణఖప్పుడు

**ఖరుడు రాక్షసవీరులను రామునిపైకిపంపుట**

60 వంచన జేసిన - సోదరులిరువురి
వేడి రక్తమును - త్రాగనెంచితిని
నా అభిలాషను - దీర్పుముసోదర
అని శూర్పణఖ - కోరినంతనే
దండకాటవిని - డంబము మీరగ
సంచరించెడి - మనుజాధిపులను
జంపిరండని - పదునారువేల
రక్కసులంపెను - ఖరుడు అంతట

61. పర్ణశాలకు - దారిజూపుచు
శూర్పణఖంతట - ముందునడువగా
దనుజసేనలను - రాముడు గాంచి
కాంచనబాణము - కేల్గైకొని
దండకవని నివ - సించు దనుజుల
అగ్ని శరములకు - ఆహుతి జేసి
మునిపుంగవుల - గావగవచ్చిన
రామలక్ష్మణులు - మేమని పలికె

62. శూలపాణులై - ఉన్నదనుజులు
పటుకోపమ్మున - నిప్పులు గ్రక్కెడి
అతి పరాక్రముని - రాముని కనుగొని
దనుజకులంబున - భయంకరుడగు
ఖరుడుపంప నిను - పోరునందున
తుదముట్టింపగ - వచ్చినవారము
ధైర్యమున్నచో - నిలిచి పోరుమని
పలుకరినోక్తులు - పలికె అసురులు

63 ఆ కరినోక్తులు - విని శ్రీరాముడు
ప్రళయకాలుడై - ప్రజ్వరిల్లుచు
వాడిశరములను - ప్రయోగించగా
దనుజుల ఉరములు - చీల్చి వెడలగా
విగతజీవులై - పడిరి పుడమిని
అదిగాంచిన ఆ - శూర్పణఖప్పుడు
రాక్షసవీరులు - రాముని శరముల
కాహుతయ్యెనని - ఖరునికి జెప్పె

**శూర్పణఖ ఖరుని యుద్ధమునకు పురికొల్పుట**

64 రామలక్ష్మణుల - బలతేజంబులు
పరిపరివిధముల - బొగడె శూర్పణఖ
నీ సేనలతో - సంగరమందున
రాముని ముందు - నిలువజాలవని
నామది పరిపరి - చెప్పుచున్నది
కావుననీవు - భీమబలులతో
వేగమె వెడలి - వారిని ద్రుంచుము
అనిపురి కొల్పెను - ఖరుని శూర్పణఖ

**ఖరదూషణాదులు యుద్ధమునకు వెడలుట**

65 ఆ మాటలు విని - ఖరుడు రేగుచు
మంత్రి పుంగవుని - దూషణుగాంచి
నాలుగుదిక్కుల - రాక్షసవీరుల
యుద్ధమునకు - సన్నద్ధులుకమ్మని
తన అరదమ్మును - సిద్ధపరచుమని
ఆజ్ఞ నొసగెను - డంబముమీరగ
దిక్కులన్నియు - పిక్కటిల్లగా
జన స్థానమునకు - కదలెను ఖరుడు

66 రణమున కేగెడి - ఖరధూషణులకు
దుశ్శకునములు - గోచరించెను
రాముడు గాంచెను - శుభ శకునములను
దానవవీరుల - సింహనాదములు
వినిన రాముడు - లక్ష్మణుగాంచి
శరచాపంబులు - కేలన్గైకొని
దుర్గమమగు ఈ - గిరిగుహయందున
సీతనుదాచి - కాపుకాయుమనె

67 వచ్చు రక్కసుల - నుగ్గడగింపగ
శరచాపములను - కేల్గైకొన
దేవగంధర్వ - సిద్ధ సాధ్యులు
రామఖరుల సం - గ్రామము గాంచగ
అంబరమందు - విమాన రూఢులై
గో బ్రాహ్మణులకు - శుభమగు గాక
లోకములకు - భద్రంబగుగాక
జయతుజయతు - రఘురామునకనిరి

**రాముడు ఖరుని సైన్యమును జంపుట**

68 ఒంటిగ రాముని - జూచిన అసురులు
సాలవృక్షములు - కొందరుగ్గైకొని
భూరిశిలలుమరి - కొందరుకేలిడి
శూలకుంతములు - కొందరుపట్టి
ముసలముద్గరా - భిండివాలముల
కేలనిడుకొని - రణముజేయగా
రఘునందనుడు - గాంధర్వాస్త్రము
ప్రయోగించి ఖరు - సేనల దునిమెను

69. తెగిన శిరములు - కమఠంబులతొ
మదగజంబులు - మకరంబులతొ
తెగిన బాహువులు - మీనంబులతొ
రక్తపుటేరుల - పంకంబయిన
శోణితలంబును - గాంచి అసురులు
పులినిగన్న హరి - ణంబుల వోలె
భీతచిత్తులై - పరుగున బోయి
ఖరునిమాటున - తలలు దాల్చిరి

70 అదిగాంచిన ఆ - దూషణుడపుడు
మనుజునకోడి - ప్రాణభీతిచే
వచ్చిన మీరు - నాచేచత్తురు
అని అసురులను - పోరుకుపొమ్మన
రాముకెదురేగి - రణమునుజేయు
వజ్రతుల్యమగు - శరవర్షముచే
భూరుహంబులను - నరికిన రీతిని
రాముడు బలినిడె - అసురులధరణికి

71 రామవిక్రమము - గని దూషణుడు
పటురోషంబున - ఎదురిడి పోరగ
ఆ దూషణుని - ఇరుకరములను
నరికె రాముడు - నిశితశరంబుల
మదగజంబువలె - ధరణినిగూలి
దూషణుడరిగె - కాలుని పురికి
సర్వభూతములు - మేలుమేలని
సంతసించుచు - పొగడెరాముని

**రాముడు మహాకపాల, స్థూలాక్ష, ప్రమాదులను జంపుట**

72 ఆ కపాల స్థూ - లాక్షుప్రమాదులు
ముప్పురసురులు - రామునెదుర్కొన
మహాకపాలుని - శిరమును ద్రుంచి
స్థూలాక్షుని అక్షులు - శరముల బొడిచి
మహిత బాణముల - ప్రమదుని గూల్చగ
అనుజుని మరణము- అసురుల మరణము
వినిన ఖరుండు - అగ్నిహోత్రుడై
సేనాపతులను - పంపెరణమునకు

73. శునిశితశర - వర్షంబు కురిపించ
కౌసలేయుని - ఫాలభాగమున
మూడుబాణములు - నాటుకొనంగ
రాక్షసాధమా - నిన్ను శూరుడని
మెచ్చితినేడు - ఈ రణంబునా
మెత్తని పూవుల - వలె బాణంబులు
దాల్చితి నేను - లలాట మందునని
వాడి శరంబులు - ప్రయోగించెను

74 నలుబది వదలెను - వాని ఉరమున
ఒక బాణమ్మున - త్రిశురు ధనువును
నాలుగు శరముల - తురగంబులను
ఎనిమిది శరముల - రథసారథిని
గూల్చెరాముడు - రణోత్సాహియై
పుడమిని గూలి - పరువులెత్తెడి
త్రిశురు శిరమును - బాణత్రయముచె
ఖండించెను ఆ - రఘువరుడంతట

**రాముడు కాలకార్ముకాది సేనానాయకులను జంపుట**

75 కాలకార్ముకుడు – కరవీరాక్షుడు
మేఘమాలియు – మహామాలియు
పరుఘుండును – విహాంగముండును
యజ్ఞశత్రుడు – దుర్జయుండును
సర్పాస్యుడును – శ్యేనగామియు
రుధిరాశనుడు – పృథుగ్రీవుండను
పన్నిద్దరుసే – నాపతులంతట
రామునెదిరించి – నిహతులాయిరి

75 ఖరునునిగాంచి – త్రిశరుడిటుపలికె
రణరంగంబున – రామునిదునిమి
మిత్తినిగొన్న – రాక్షసవీరుల
ఆత్మలన్నిటికి – శాంతిని గూర్తును
అనుచుత్రిశురుడు – బలదర్పంబున
రామునికెదురిడి – పోరుసలుపగా
మారణాయుధము – రాముడొదలగ
ఆయుధహతుడై – యమపురికరిగెను

**రామఖరాసురుల యుద్ధము**

77 రామునిబలమును - త్రిశురుని మరణము
గాంచిన ఖరునకు - గుండెలదిరెను
ఖరుడంతట శ్రీ - రామునెదుర్కొన
వైష్ణవాస్త్రమును - రాముడు పట్టెను
ఖరుని శరములు - రాఘవు తనువును
సోకినంతనే - రక్తము జిమ్మెను
రక్తము జిమ్మెడి - రామచంద్రుడు
చండభానుడై - తోచెనప్పుడు

78 దారుణరీతిని - ఖరధ్వజంబును
త్రుంచి పుడమిపై - పడునటుజేసెను
ఇరుశరములతో - భుజశిఖరముల
అర్థ చంద్ర బా - ణమ్ముల మూడిట
ఖరుని వక్షమును - కడునొప్పించి
నాల్గుశరములతొ - హయములద్రుంచి
ఏక శరమ్మున - సారధిద్రుంచి
ఖరుని కేలగల - కార్ముఖముద్రుంచె

79 కాలదండమును - బోలెడిగదను
కేలనిడుకొని - ఖరుడు లంఘించ
దండకాటవిని - ధర్మనిష్టులగు
ముని పుంగవులను - కడుహింసించిన
దానవాధమా - నీశిరమిపుడే
తాళఫలంబలె - నేలబడురీతి
ఖండించెద నా - శరములచేతని
నిష్టురవాక్కులు - రాముడపలుక

**ఖరుడు రాముని నిందించుట**

80. బలసంపన్నులు - పౌరుషశాలురు
తమను తాముగా - పొగడు కొందురా
అతినీచులగు - ధారుణీపతులు
రజ్జులాడెదరు - నిరర్థకముగా
నీకునీవుగా - పొగడుకొనుటలో
కనుగొంటిని నీ - పిరికితనంబును
చప్పుడిమూకను - జంపినంతనే
కన్నుమిన్నులు - కానకుంటివి

81. ముల్లోకముల - వధింపబూనిన
దండధరునివలె - నేగదబూనితి
ప్రొద్దుగుంకెడి - సమయమాయెను
సద్దులుఆపి - రణముజేయుమని
కరములనున్న - గదనుత్రిప్పుచు
అంతరిక్షమున - కడుచెలరేగెడి
ఆనిశాటుగద - తునియులు జేసెను
రఘువీరుడు తన - వాడి శరముచే

**ఖరుడు రామునిచే హతుండగుట**

82. మంత్రబలముచే - ధరణినిగూలిన
కాలనాగువలె - కూలినగదను
జూచి రాముడు - ఇటులపలికెను
నీబలసంపద - పొగడుకొంటివి
రణమున గూలిన - రక్కసిమూకకు
నా రుధిరముచే - ఆత్మశాంతిని
జేకూర్చెదనని - ప్రతినబూనితివి
అని శ్రీరాముడు - ఎగ్గిసలాడెను

83 గరుత్మంతుడు - అమృతంబును
హరియించిన విధి - నీదు ప్రాణములు
భీమాస్త్రంబున - ద్రుంచి వేతునని
శరమునువదలె - శ్రీరఘురాముడు
వేయిపిడుగుల - గర్జనజేయుచు
ఖరునిఉరమును - చీల్చగశరము
ధరణినిగూలి - దనుజాధిపుడు
చేరెకృతాంతుని - గేహసీమకు

**మునిపుంగవులు శ్రీరామునిస్తుతించుట**

84 రాజఋషులును - బ్రహ్మఋషులును
సంతోషంబున - రామునిజేరి
దండకమందున - తాపసిజనులు
కడు సుఖంబుగా - ఇక జరింతురని
బహురీతుల - గొనియాడ రాముని
దేవగంధర్వ - సిద్ధసాధ్యులు
ఇనకులేశుపై - కుసుమవర్షము
కురిపించిరి తమ - హర్షము దెలుప

**అకంపనుడు రావణునకు ఖరదూషణాదుల వృత్తాంతమును దెల్పుట**

85. అదిగాంచిన ఒక - రాక్షసవీరుడు
అకంపనుండను - పేరిటివాడు
అతి శీఘ్రముగా - లంకనుజేరి
లంకేశునితో - ఇటులపలికెను
జనస్థానమున - ఖరదూషణులు
త్రిశురుండను - పదునాల్గువేవురు
రక్కసులందరు - రాముని కరముల
వధియింపబడి - యమపురికరిగిరి

**అకంపనుడు శ్రీరాముని గుణగణమ్ములను రావణుని కెరింగించుట**

84. అదివినినంతనె - దశవదనుండు
అపరరుద్రుడై - తాండవించుచు
ఈ క్షణమే నే - పంచవటిజేరి
పరిమార్చెద ఆ - దాశరథులనన
దివ్యాస్త్రమ్ములు - కలిగినవాడు
అమిత తేజుడు - అతి బలవంతుడు
ముజ్జగంబులను - నీటిముంచగల
బలోపేతుడు - శత్రుకర్షణుడు

87. ధరణీధరమ్ములు - మోయగలాడు
వారిధినైనను - ద్రుంచగలాడు
సర్వసృష్టిని - నాశముజేసి
క్షణములోన - సృష్టించగలాడు
సర్వలోకములు - ఎదురిడిపోరిన
రాముని గెలుచుట - బహుదుస్సహమని
అకంపనుండు - పలువలురీతుల
రామునిగుణములు - వలికెనప్పుడు

88. ఓ అసురేంద్రా - కడు ఉపాయమున
రాముని గెలిచెడి - మార్గమున్నది
త్రిలోకసుందరి - రామునిభార్య
సీత యనుపేర - వరలుచున్నది
సురగంధర్వ - ఉరగ దానవ
సుదతులెవ్వరు - సరిగారామెకు
ఆమెఎడల అతి - ప్రీతిపాత్రుడు
ఆమెలేనిదే - బ్రతుకజాలడనె

89. వంచన జేసి - సీతను నీవు
చేపట్టినచో - కాంతవిరహమున
రాముడు చేరు - కృతాంతుసీమకు
ఇదియెతప్పవే - రొక్కమార్గము
కనరాకున్నది - యోచన జేసిన
ఆ పలుకులువిని - దశవదనుండు
యోచన జేసి - కాంచనరథమున
మారీచునిగన - వెడలె వడివడిగ

**రావణుడు మారీచుని కడ కేగుట**

90 దానవేంద్రుని - గని మారీచుడు
కడువిధముల - సంతుష్టుని జేసి
ఓదనుజోత్తమా - నీవు కుశలమా
రాణులు తనయులు - రాజ్యరమయును
కడుసేమంబని - నేతలచెదను
వచ్చిన కార్యము - సెలవిచ్చినచో
నెరవేర్తునని - పలుకగా విని
దశకంఠుడు - ఈరీతి జెప్పెను

91 రాముడనెడి ఒక - నరునిచేతిలో
ఖర ధూషణ త్రి - శిరాధి వీరులును
రాక్షసవీరులు - పదునాల్వేవురు
జనస్థానమున - ద్రుంచబడినారు
అతని సతిని - వంచించి చెరబట్ట
యోచన జేసితి - నీసహాయమున
ఆ కార్యమున - నాకు తోడగుము
అని రావణుడు - ఆనతినిచ్చెను

**మారీచుడు రావణునకు హితోపదేశము జేయుట**

92 దనుజనాయకుని - మనసు గ్రహించి
మిత్రరూపుడగు - శత్రువెవ్వడో
ఆ వైదేహిని - అపహరింపుమని
అనర్థకార్యము - నీకు జెప్పెను
అని పలువిధముల - హితములు జెప్పి
నీదు చెలులతో - కలిమి మీరగా
సురభోగముల - తేలియాడు మన
సంతసించుచు - వెడలె రావణుడు

**శూర్పణఖ రావణుని నిందించుట**

93. పుష్పకమందున - హేమాసనమున
దశశిరంబుల - ఇరువది కరముల
మణిహారంబుల - దివ్యకాంతుల
సురపరివృతుడగు - సురరాజావలె
మంత్రివరుల - పరివేష్టితుడైన
రావణుజేరి - శూర్పణఖిటులనె
అలకాపతిని - గెలిచితివీవు
పుష్పకంబును - హరియించితివి ॥

94. అస్త్రశస్త్ర వి - శారదుండవు
దిక్పాలురకు - దిక్కువునీవు
జన్నములను - కడతేర్చితివీవు
నరవానరులచే - మరణములేని
ఘనవరములను - పొందితివీవు
దరిరానున్న - మిత్తిని వీవు
గానగలేవా - అని శూర్పణఖ
నిందించెను ఆ - రావణాసురుని

95 అని దూషించిన - చుప్పనాతిగని
బల దర్పితుడగు - రాక్షసటేడు
జేవురించిన - కన్నులతోడ
రాముడెవడు - పరాక్రమమెట్టిది
దండకాటవికి - ఏలవచ్చెను
ఖరదూషణాది - రాక్షస వీరుల
ఏ అస్త్రమ్మున - తుద ముట్టించెను
విశదముగా వివ - రించి చెప్పుమనె

96 ఇనకుల మందున - దశరథరాజా
రాజఋషులలో - కడుఉత్తముడు
వర్ణధర్మములు - గతులుతప్పక
పాలించెడి కడు - పుణ్యశీలుడు
వానికిగలరు - సతులుమువ్వురు
కౌసల్య సుమిత్ర - కైకలను వారు
సంతతిలేమిచె - దశరథరాజా
పుత్రకామేష్టి - యాగముజేసె

97. యాగఫలముగా - నలుగురు సుతులను
రాణులు కనిరి - కడు మోదంబున
కౌసల్యా సతి - రాముని గనెను
భరతుడు జనియించె - భార్య కైకకు
సుమిత్రకనెను - ఇద్దరు తనయుల
లక్ష్మణ శత్రుఘ్న - నామధేయులు
చిరుతప్రాయమున - రామలక్ష్మణుల
సాయము కోరెను - ఆ గాధేయుడు

98 విశ్వామిత్రుని - యాగముగావగ
రామలక్ష్మణులు - ఏగుసమయాన
కపటి రక్కసిని - తాటకిగాంచి
అబలని యంచక - వధించిరంతట
యాగము జరిగెడి - సమయమందున
తాటకసుతులు - మారీచ సుభాహులు
యాగవిధులను - పలుపలురీతుల
భగ్నముజేయగ - కడుయత్నించిరి

99 రామలక్ష్మణుల - నిసిశరములచే
మారీచుడుశత - యోజనమ్ములు
గొనిపోబడిఅట - సాగరమునబడె
సుభాహుడంతట - యమపురికరిగెను
అటు పిమ్మట - వారేగుచుండగా
శాపవశముచే - శిలగామారిన
ముని గౌతముని - భార్య అహల్యను
పాదస్పర్శచే - నాతిగ జేసెను

100 జనక మహీపతి - ఆహ్వానముగొని
ఏగిరివారు - మిధిలానగరికి
మిధిలానాధుని - ముద్దు కూతురు
సీతయనుపేర - వరలెడు కన్యను
స్వయంవరని - భందన మేరకు
శివుని ధనువును - తునియలు జేసి
పరిగ్రహించెను - జనకజనపుడు
జనులందరు - కడుమోదమొందగ

101 దశరధభూపతి - ప్రధమకుమారుడు
రఘురాముడు - నారాయణతేజుడ
ధనుర్విద్యలో - అగ్రగణ్యుడు
ఏక సతీవ్రతు - డార్తశరణ్యుడు
సర్వలోక వి - ఖ్యాత చరిత్రుడు
ఓర్పునందునా - ధరణి సమానుడు
కీర్తియందు దే - వేంద్రసమానుడు
పితృవాక్యపరి - పాలకుడాతడు

102.తండ్రి యానతిని - శిరమున దాలిచి
వనభూములకు - వెడలగరాముడు
ధరణీసుతయు - భ్రాతలక్ష్మణుడు
అనుసరించగా - అడవులదిరుగుచు
పంచవటిదరి - పర్ణశాలను
నిర్మించుకొని - కాలముగడపగ
నాకనుసన్నల - వారుపడితిరి
మరునిబాణముల - పరవశనైతిని

103 రామలక్ష్మణుల - వేడుకొంటిని
నన్ను భార్యగా - స్వీకరింపుమని
వారిరువురు నను - మోసబుచ్చగా
సీతను నేను - మ్రింగజూచితిని
అదిగాంచిన ఆ - రాముడంతట
లక్ష్మణ ఈమెకు - బుద్ధిచెప్పుమన
వానిశరమున - నా ముకుచెవులను
తృటిలోద్రెంచెను - లక్ష్మణుడంతట

104 వారిరువురిపై - కినుకవహించి
నా అనుజులగు - ఖరధూషణులను
పోరుకు పొమ్మని - పురికొల్పితిని
పదునార్వేల - రాక్షసవీరులు
పటురోషమ్మున - రామునెదుర్కొన
సేనాపతులు - ఖరధూషణులు
రాముని శరముల - బారినబడి
అరిగెకృతాంతుని - గేహసీమకు

105 ఆ విధిరాముని - చరితమంతయు
విపులముగా వివ - రించి శూర్పణఖ
శ్రీరఘురాముని - ప్రియసతిసీత
ఆదిలక్ష్మి వలె - అలరుచున్నది
గరుడ గంధర్వ - కిన్నెరాదుల
యక్షకింపురుష - అంబుజాక్షుల
ముజ్జగములలో - నేగనలేదు
అట్టి జవ్వనిని - అనెశూర్పణఖ

106 అట్టి వనితను - భార్యగపొంది
కౌగిటజేర్చి - మన్మథక్రీడల
తేలియాడెడి - మగవాడిలలో
వాసవుడై వ - ర్ధిల్లునుగాదె
అట్టి సీతను - నీ జతగూర్చగ
కామరూపమున - నేయత్నించగ
క్షణమునగ్రహించి - లక్ష్మణుడంతట
ముక్కుచెవులను - కోసి పంపెను.

107 సీతనుభార్యగ - పొందదలచిన
రామలక్ష్మణుల - పోరునద్రుంచి
అనాధ సీతను - రయమునబట్టి
లంకకు తెమ్ము - తేలుము సుఖముల
నా పలుకులు రుచి - యింపనియెడల
ఖరధూషణులను - మనమున దలచి
పోపామిప్పుడే - దండకాటవికి
ప్రతీకారమును - జేయగనీవనె

**రావణుడు మారీచునితో జనస్థాన వృత్తాంతము దెలుపుట**

108 సోదరి ప్రేరణ - వినినరావణుని
మనమున రగిలెను - మరుని తూపులు
మంత్రులతోడ - మంతనంబులు
ముగియుంచెను - క్షణ మాత్రమందున
ఎటులైనను - సీతాపహరణము
జేయవలెనని - యోచనజేసి
ఖరపిశాచ వద - నంబులుకలిగిన
అరదము నందు - బయిలుదేరెను

109. గగనగాముడై - పయనముజేసి
సొంపగువారధి - ఇంపుగదాటి
సాలతాల తమా - లవృక్షముల
పలుపలు రకముల -ఫల పుష్పములతో
అలరారెడి ఆ - శ్రమముల గాంచుచు
కాషాయచేలమును - మేనునదాల్చి
కఠోరతపమును - ఆచరించెడి
మారీచుని దరి - జేరె రావణుడు

110 దనుజాధీశుని - గని మారీచుడు
మరలివచ్చుటకు - కారణమడుగ
నీ వెరుగుదువు - నరుడు రాముని
ఖరదూషణాది - అసురగణమ్ముల
రణమునందు - తా నొక్కడెదుర్కొని
పంపెకృతాంతుని - గేహసీమకు
మన అధీనమున - నున్న దండకను
తన ఆధీనము - జేసికొనివాడు

111. రాముడు క్రూరుడు – అధర్మాత్ముడు
దయారహితుడు – అతి కాముకుడు
లుబ్ధుడు మూర్ఖుడు – అతికర్కశుడు
అతని అనుజుడు – సుమిత్ర సుతుడు
అన్ననుమించిన – దుస్సాహసుడు
నాదుసోదరి – చుప్పనాతికి
ముక్కుచెవులు – ఖండించి పంపెను
కావున నామది – పగచెలరేగెను.

112 నీ సాయముగొని – నా కార్యంబును
సఫలము జేయగ – మదినిదలచితి
కడురూపవతి – రామునిసతిని
అపహరించి – నే లంకకేగెద
బంగరుజింకగ – రూపునుదాల్చి
పంచవటిదరి – పర్ణశాలను
జేరి రాముని – ప్రియసతి ఎదురుగ
అందముగా నీ–వటు నిటు తిరుగుము

113 నీ రూపముగని - అచ్చెరువొంది
పట్టితెమ్మని - పతినిగోరును
సతికోరికను - కాదనలేక
రాముడు పడును - నీదు వెనుకను
చెంగుచెంగున - పరుగిడి నీవు
సుదూరముగా - గొని పామ్మాతని
కూత కూయము-హా! సీతా! హా! లక్ష్మణాయని
దండక మంతయు - ప్రతిధ్వనించగ

**మారీచుడు రావణునకు రాముని పరాక్రమమును దెలుపుట**

114 రాముని కాపద - కలిగెననుకొని
మరది లక్ష్మణుని - పంపుజానకి
రామవాటికను - జేరిననేను
సీతను సులువుగ - అపహరించెద
అని లంకేశుడు - పలుకగావిని
వినాశకాలే - విపరీతబుద్ధిః
అని ధరపెద్దలు - నుడివినమాటలు
నీవు మరచితివ - అసురనాయకా!

115 రాముని పైన - కినుకవహించి
పలికితి వెన్నో - అసత్యములను
శ్రీరఘురాముడు - సత్యవ్రతుడు
సర్వలోకులకు - నాధుడాతడు
పట్టాభిషేక - సమయమందునా
జనకుని ఆనతి - జననికోర్కెలు
తీర్చగనెంచి - రాజ్యము సిరులు
తృటిలో వీడి - దండక జొచ్చెను

116 రామునిభార్య - జనకతనూజ
అనలముబోలు - మహాపతివ్రత
వహ్నిశిఖలను - బట్టి దలంచిన
దగ్ధమౌదువా - క్షణమునందున
రాజభోగముల - రాగభోగముల
సౌఖ్యపడంగా - దలచితివేని
రామునిమనము - నొచ్చుకార్యము
రావణ జేయకు - నే వేడెదననె

117.కౌశికుయాగము - గాచుటకొరకు
రామలక్ష్మణులు - వచ్చుట తెలియక
జరుగు యాగమును - ధ్వంసము జేయగ
ఏగిన మమ్ము - రాముడుగాంచి
ఇనుమంతయు - విభ్రాంతి జెందక
శరచాపములను - ప్రయోగించగా
శతయోజనములు - గొనిపోబడితి
సాగరమున పడి - మునిగిపోతిని

118 రణమునందు - కోదండరాముని
ఎదురిడి ఎవ్వరు - బ్రతుక జాలరు
పరసతి మోహము - ఎంతో పాపము
కడు సుందరులగు - నీ ప్రియసతుల
కూడి సుఖింపుము - కూరిమిమీరగ
మంత్రిసామంత - దండనాథుల
లంకారాజ్యము - స్థిరముగ నేలుము

**రావణుడు మారీచుని నిందించుట**

119. బుద్ధులు చెప్పిన - మారీచుని గని
పిరికిమాటలు - మానిపోయకు
నరవానరులచె - మరణములేని
ఘనవరముల నే - పొందియుంటిని
రాముడు నరుడు - అల్పుడాతడు
వానిగూర్చి నే - భయపడనేలా
నాకార్యమ్ము - సఫలము జేసిన
నీకొసగెద నే - నర్ధరాజ్యము

120 అటుగాకుండిన - నే నినుజంపి
కాలునిపురికి - కాన్కగ బంపెద
అని లంకేశుడు - పలుకగా విని
ఏగనిచో దశ - కంఠుడుదునుము
ఏగినచో రఘు - రాముడుచంపు
ఎటుగాంచిన - ఇక చావుతప్పదని
రామబాణమున - మరణము మేలని
తాటకి తనయుడు - తన్వాయ మొందెను

**మారీచుడు బంగరుజింక రూపమున పంచవటి జేరుట**

121 నీల మణులవలె - శృంగాగ్రములతొ
నలుపు తెలుపు గల - లలిత ముఖముతొ
నీలికాంతులు - మెరయు కనులతొ
భాను తేజమున - మెరయు తనువుతొ
నల్లకలువలలె - బోలు చెవులతో
క్షణములోన - మారీచుడంతట
బంగరుజింకగ - రూపునుదాల్చి
రంగుల రామా - శ్రమము జేరెను

**లక్ష్మణుడు రామునకు మాయామృగంబని తెలుపుట**

122 హరిణమేరీతి - సంచరించునో
ఆ విధముగ నటి - యించె దనుజాడు
సుమములు కోయగ - వచ్చిన జానకి
బంగరుజింకను - గాంచినంతనే
ప్రాణనాధుని - మరది లక్ష్మణుని
చోద్యముజూడగ - రమ్మని పిలువ
రాముడు ఎంతో - విస్మయమొంద
లక్ష్మణుడనె ఇది - మాయామృగమని

**బంగరుజింకనుతెమ్మని సీతరాముని కోరుట**

123 రాముని గాంచి - సీత పలికెను
అతివిచిత్రమగు - మృగములనెన్నో
గాంచినారము - గహనభూముల
గాంచగలేదు - కాంచనహరిణము
కావున దీనిని - పట్టితెచ్చిన
అయోధ్యనగరికి - తోడ్కొని పోయెద
అత్తలు మరుదులు - ఆనందింపగ
రాజభవనమున - తిరుగాడునిది

124 బంగరుజింక - చిక్కకపోయిన
దానివధించి - గొని తెమ్మిటకు
దానిచర్మము - కడుయోగ్యమ్ము
కడుమృదువై - మనోహరమైనది
వచ్చికపైన - బరచిదానిపై
ఇరువురము - కూర్చుండదగ్గది
మిమువ్యథ పెట్టుట - మంచిది కాదు
నా ఆశయమది - విన్నవించితిని

**రాముడు మాయామృగంబుకై వెడలుట**

125 ధరణిజ పలుకులు - విని దాశరథి
వింటివెలక్ష్మణ - వదిన కోర్కెను
ఇది నిజముగ - మాయామృగమైన
దీనివధించి - మునుల గాచెద
అటుగాదేని - పట్టి తెత్తును
ముదము మీర - మీవదినకిత్తును
కాననవాసము - బడలిక మరచి
కాలము గడుపు - బంగరు జింకతో

126 పట్టుబడనిచో - చంపి తెత్తును
ఆ మృగచర్మము - రయముననేగొని
అంతదనుక నా - ఆరవప్రాణము
అయిన జానకికి - కడు రక్షణగా
పక్షీంద్రుడు జ - టాయువు నీవును
అప్రమత్తముగ - కాపుకాయుడు
అనుక్షణము - ప్రమాదమేదైన
శంకించుట ఎం - తైన మంచిదనె

**రాముడు మాయాకురంగమును జంపుట**

127 అని రఘువీరుడు - కోదండమునిడ
మారీచుని హృది - ఝల్లుమన్నది
వింటినిబూని - వెంటవచ్చెడు
రాముని కనుగొని - సంతసించెను
చంగుచంగున - గెంతుచుపరువిడె
వృక్షచ్ఛాయల - ఒకపరిజేరి
మెత్తని పచ్చిక - ఒకపరిమేసి
పొదలమాటున - ఒకపరిదాగి

128. బిత్తరి చూపుల - రాముని జూచి
కపటహరిణమట - కడువంచించి
జింకలమందల - జేరిహసించి
పలుపులు తోవల - పరుగులెత్తగా
సందేహించెను - రాముడు మనమున
ద్రుంచవలెనని - నిశ్చయించుకొని
అమోఘాస్త్రము - ప్రయోగించగా
తాటకతనయుని - గుండెను జీల్చెను

129.మారీచుడు తన - మాయశరీరము
విడచిపెట్టి నిజ - రూపముదాల్చి
హా! సీతా! హా! - లక్ష్మణాయని
రామునికంఠము - అనుకరించుచు
దండకమంతయు - ప్రతిధ్వనింపగ
పెనుకేకలిడి - వదిలె తనువును
ఆ కేకలువిని - సౌమిత్రి సీతయు
ఏమగునోయని - రాముడు తలచెను

**సీతలక్ష్మణునితో రామసహాయార్థము ఏగమనుట.**

130.హా! సీతా! హా! - లక్ష్మణాయనెడి
ఆర్తనాదమును - వినిన జానకి
ఇదేమి లక్ష్మణ - అగ్రజాఅరుపు
ఏ కష్టంబుల - పాల్పడినాడో
దుష్టదనుజాలకు - చిక్కితిడేమో
రయమున ఏగుము - రాముని గావగ
రామునాజ్ఞ జవ - దాటగలేనని
లక్ష్మణుడనెను - అతి వినయమ్మగ

**సీతలక్ష్మణుని నిందించుట**

131 కినుక వహించి - సీత పలికెను
నిర్దయుండవు - నయవంచకుడవు
రాముడు దివికి - అరిగినపిమ్మట
ననుజేపట్టగ - తలచినాడవో
నీవేగనిచో - ఈక్షణమందున
నా ప్రాణములు - విడిచెద నేనన
కరములుమోడ్చి - వందనములిడి
సుమిత్రసుతుడు - ఇటులపలికెను

**లక్ష్మణుడు రామునిచేరగ ఏగుట**

132.నిందలు వేయుట - అబలకు సహజము
సందేహించుట - తగదు నీకని
నీమాటను జవ - దాటగ లేనని
రాముని జూడగ - పోయెదనేనని
దుశ్శకునములు - దోచెనాకని
ఈ వనసీమను - తిరుగు దేవతలు
రాముడు నేనును - వచ్చునందాక
నిన్ను గాతురని - వెడలె లక్ష్మణుడు

**రావణుడు మునివేషమున పర్ణశాలకరగుట**

133. సమయముకొరకు - వేచియుండిన
దశకంఠుడు - యతివేషము దాల్చి
సన్నికాషాయ - వస్త్రము దాల్చి
ఛత్రము పావలు - శిగలు ధరించి
కమండలము - త్రిదండము బూని
లలాటమున - విభూతినిదిద్ది
సీతాపహరణ - జేయునిమిత్తము
రావణుడరిగె - పర్ణశాలకు

134. అటులేగెడి ఆ - రావణునిగని
వనమంతయు - నిశ్శబ్దమాయెను
పక్షులు మృగములు - బెదరి పరువిడె
భూరుహంబులు - గజగజ వణికెను
గగనమంత మే - ఘావృతమాయెను
పవనుడంత మం - దముగావీచెను
గౌతమినీరము - పరుగులు దీసెను
భాస్కరుడంతట - ఘనములజొచ్చెను

135. యతివేషమున - వచ్చినవానికి
దర్భాసనము - ఇంపుగ నమర్చి
అర్ఘ్యపాద్యములు - వివిధ ఫలములు
ఫలహారమునిడి - పూజలు జేయ
పులులు సింహములు - కోతులు నెలుగులు
పలు విధంబులగు - దుష్ట మృగంబులు
చెలరేగెడి ఈ - వనమునందునా
ఒంటరిగా నీ - వెటులుంటివనె

**రావణుడు సీతను పొగడుట**

136 ఓ తరుణీ నీ - వెవ్వరి దానవు
గహనభూములకు - ఏలవచ్చితివి
మన్మథసతివో - నాగవనితవో
ధరణీమణివో - గంధర్వవనితవో
కిన్నెరాంగనవా - కీర్తిదేవివో
సతి పార్వతివో - ఆ శ్రీదేవివో
కామరూపులగు - రజనీ చరులు
తిరుగీవనమున - నీ వెటులుంటివి

137.నీ రూపము కడు - తేజోవంతము
నీ నయనములు - నల్లకలువలు
నీ జఘనము - కడువిశాలము
నీ ఊరువలు - కరితొండములు
నీ చనుదోయలు - తాళఫలములు
నీ కురులన్నియు - తుమ్మెదరెక్కలు
నీ దంతములు - మల్లెమొగ్గలై
అలరుచున్నవి - ఓ కృశోదరి

**రావణునితో సీతతనవృత్తాంతమును జెప్పట**

138.అటు ప్రశ్నించెడు - మాయ యతినిగని
చెప్పనిచో యతి - శపించు ననుకొని
మిథిలానాథుని - ముద్దుకూతురను
సీతయనుపేర - వరలుదానను
దశరథేశ్వరుని - పెద్ద కోడలను
శ్రీరఘురాముని - ప్రియసతి నేను
పదమూడేండ్లు - కడు సుఖంబుగా
తేలియాడితి - క్ష్వాకులయింట

139 త్రయోదశాబ్దమున - దశరథేశ్వరుడు
రఘురాముని - పట్టాభిషేకము
చేయగనెంచెను - కడుముదంబున
మంథరయను - ఒక దాసి మాటవిని
వెనుకటి వరములు - రెండు తీర్పుమని
దశరథుప్రియ - సతికైక కోరెను
భరతునకు ప - ట్టాభిషేకము
పదునాల్గేండ్లు - రామవనవాసము

140. జనకుని మాటను - నిలుపుట కొరకు
రామచంద్రుడు - వ్రతము గైకొని
కారడవులకు - పయనమాయెను
నేనునులక్ష్మణు - డనుసరించి ఈ
దండకాటవిని - చేరుకొంటిమి
పర్ణకుటీరము - నిర్మించుకొని
ప్రకృతిసొంపులు - ఇంపుగగనుచు
ఆనందముగా - గడుపు చుంటిమిట

**రావణుడు సీతకు తనవృత్తాంతము దెలుపుట**

141.ఓ యతీశ్వరా - నామమెట్టిది
కులగోత్రములను - తెలియబరుచుమా
అనిఅడిగిన ఆ - సీతను గాంచి
నా నామమును - వినినయంతనే
జగములన్నియు - గడగడ వణకును
దనుజకోటికి - నాయకుండను
లంకాధీశుడ - నేరావణుడను
ఓ విరిబోణీ - భయమొందకుమనె

142.దేవేంద్రాది - సురలందరిని
రణములందునే - గెలచినాడను
దేవగంధర్వ - సుందరాంగులను
నే హరియించి - పరిణమయమాడితి
వారందరికి - పట్టపురాణివై
నా మనమును - రంజింపజేయుము
స్వర్గసుఖంబుల - తేలియాడుము
అని లంకేశుడు - పలికెసీతతో

143 ఈ ధరనంతను - కరములబట్టి
మింటివరకు - నేనెత్తగలాడను
రణములందు ఆ - మృత్యుదేవతను
మొత్తుదు నేను - మొరలుపెట్టగా
రవిచంద్రులను - నిరోధించెద
కడలినంత అవ - లీలగ త్రాగెద
కామరూపుగోని - కామసుఖముల
ముంచితేల్పగల - సమర్ధుండనని

144 ఆ పలుకులు విని - కడురోషించి
సీతపలికె నిటు - లంకేశునితో
పుట్టితినేను - సత్కులంబున
చేబట్టితిని - రఘువంశజుని
శ్రీరఘురాముడు - నా హృదయేశుడు
సోమసమానుడు - భూరి విక్రముడు
ఇనునివీడని - తేజమురీతిగ
ఇనకులేశుని - వీడనిదానిని

145 కాలకూటమును - గ్రోలినపిమ్మట
సౌఖ్యముగా జీ - వించగోరుటయు
మెడకు గుదిబండ - తగిలించుకొని
అంబుధి దాటగ - నెంచగోరుటయు
మోక్షముగోరిన - పాపాత్మునకు
మోక్షమేరీతి - సంప్రాప్తింపదొ
అదే రీతిగ - నన్ను కోరిన
నేదొరకుట నీ - కతిదుర్లభమనె

146.బంగారమునకు - ఆ సీసమునకు
రాజహంసకు - రాబంధునకు
మృగరాజునకు - మార్జాలమునకు
ఎంత అంతరమొ - అంతయున్నది
నా రామునకు - నీకు రావణ
మహాభాగుడు - మహాతేజుడు
అగురాముని సతి - నన్ను కోరుకొని
సర్వనాశనము - బొందకు నీవనె

## రావణుడు సీతను అపహరించుట

147 గుండెరగిల్చెడి - ఆ పలుకులు విని
రాముడు రణమున - ఎదిరించినచో
నా కొనగోటికి - సరిగాడాతడు
మానవాధముడు - అల్పాయుష్కుడు
అనిలంకేశుడు - గర్జనజేయుచు
దశశిరంబులా - రూపముదాల్చి
సీతపైకెగసి - పట్టుపట్టగా
భయకంపితమై - ధరణిజమూర్ఛలె

148 ఎడమచేతితో - కురులనుబట్టి
తొడలను బట్టె - కుడికరమ్ముచే
బుధుడు రోహిణిని - పట్టినరీతిగ
రావణాసురుడు - సీతనుబట్టి
భయకంపితను - అతి భయపెట్టుచు
రధమును జేరి - మింటికెగసెను
తెలివివచ్చిన - జానకిఅరచెను
ఆ వనమంతయు - ప్రతిధ్వనించగ

**రామలక్ష్మణులను తలచి సీత దుఃఖించుట**

149 ఓ రఘునందన ! - మరది లక్ష్మణా!
దనుజాధిపుడగు - లంకాధీశుడు
పాపచిత్తమున - నను హరియించి
ఏగుచున్నాడు - లంకాపురికి
నా గోడువిని - వేగమెరండు
కార్ముకమ్మున - ఈ కామాంధుని
క్షణమున ద్రుంచి - చెరవిడిపించుడు
అని సీతాసతి - ఆక్రందించెను

150 ముకుళితకరముల - మ్రొక్కులిడెదను
మాల్యవంత ప్ర - స్రవణగిరులార
ఓ తరులారా - ఓ లతలారా
పరమపావని - ఓ గోదావరి
మృగవిహంగాది - నాయకులార
వనమున తిరిగెడు - దేవతలార
లంకానాధుడు - సీతను గొనెనని
నా రామునకు - విన్నవింపుడనె

151 ఓ కరినాత్మా! - దనుజరావణా
రామలక్ష్మణులు - లేరని తెలిసి
శ్వానమువోలె - పసిగట్టితివి
మాయరూపమున - అపహరించితివి
వాసవు చేతిలో - వజ్రాయుధము
కాలుని కరమున - కాలదండము
గతులుతప్పినా - తప్పవచ్చును
రామునిబాణము - గతితప్పదు భువి

152.దశకంఠుని ఆ - రీతి నిందలిడి
గురక పెట్టి నిదు - రించు జటాయుని
గాంచినంతనే - గద్గదస్వరమున
ఈ విధిపలికె - ధరణిజఅపుడు
ఓ! జటాయువా - రామునిమిత్రమ
రాక్షసరాజగు - రావణాసురుడు
మునివేషమును - ధరించినేడు
అపహరించి - గొనిపోవుచుండెను

153 రామలక్ష్మణులు - లేరనితెలసి
శ్వానమువోలె - పసిగట్టితిడి
ననుహరియించి - ఏగు చుంటిడి
దశరధేశుని - జాప్రియసఖుడా
రయమున బోయి - రామవిభునకు
ఈ విషయమ్మును - వేగతెల్పుమా
అనుజాలిరువురు - వేగమె వచ్చిన
ఆపదనుండి - రక్షించెదరనె

**జటాయువు రావణుని నిందించుట**

154. గురక పెట్టి నిదు - రించు జటాయువు
భయకంపితుడై - గ్రక్కున లేచి
రావణాసురుని - రధమున కెదురిడి
ఓరిదురాత్మా - అసుర రావణా
మహోన్నతమైన - భూరిబలుడను
దుర్వారుడను - యుద్ధరంగమున
సత్యధర్మ వి - స్తార చరిత్రుడ
నన్ను బిలుతురు - జటాయువనియు

155 దానవనాథా - సర్వజగతికి
మూలాధారుడు - రఘునందనుడు
ధర్మనిరతుడు - సత్యసంధుడు
ఏక సతీవ్రతు - డార్తశరణ్యుడు
పితృవాక్యపరి - పాలకుండును
భూరివర్తనుడు - క్ష్మావరపుత్రుడు
అట్టి రాముని - నిజసతి సీతను
దొంగలింప కడు - సాహసించితివి

156 ఈ ధరయందున - రాజులందరూ
సర్వ ధర్మములు - అరసిన పిమ్మట
పాలించెదరు - ప్రజలందరిని
ఆరాజాను ఆ - ధర్మముగా గొని
జనులాబాటలో - సంచరించెదరు
కంచెయె చేను - మేసిన రీతి
నీవీరీతిగ - ధర్మము తప్పి
వంచనచే హరి - యింప పాడియె

157 బ్రహ్మవంశమున - పుట్టినవాడవు
ధర్మశాస్త్రములు - చదివిన వాడవు
పటుతర తపమును - ఆచరించితివి
శివుని మెప్పుగొని - వరములందితివి
అష్టదిక్కుల - అధిపతులందర
నీపదదాసుల - జేసితివెపుడో
యక్షగంధర్వ - కిన్నెరాదుల
కాంతలెందరినో - లంక జేర్చితివి

158 పుట్టుక తోడ - వచ్చిన గుణములు
కట్టెలందునా - కాల్చబడునని
ఎపుడో పెద్దలు - తెలిపితిరిగదా
అవియన్నియు - నీకవగతమేకద
ఖరధూషణులు - త్రిశిర విక్రములు
రామునిశరముల - నేలకొరిగిరి
పురుషశ్రేష్టుడు - రాముని సతిని
దొంగిలించుట - పాడిగాదనె

159 రామునిసతిని - హరియించుకొని
సౌఖ్యముగా జన - లేవు లంకకు
ఆగుమాగుమో - లంకాధిపతి
చేవయున్నచో - పోరుచేయుము
పోరుకునీవు - జంకితివేని
విడువుము సీతను - బుద్ధిశాలివై
అనిపలికెడి ఆ - పక్షీంద్రుని గని
పట్టె వింటిని - దశకంధరుడు

**రావణ జటాయుల యుద్ధము**

160 రావణాసురుడు - శరపరంపరల
కురిపించెను ఆ - పక్షీంద్రునిపై
నఖములచే ఆ - శరజాలమును
తునియలు జేసి - పారవైచెను
జటాయువంతట - తనువువిదిల్చి
ఉగ్రరూపమును - దాల్చి ఎగిరెను
దశశిరముల తన - పదముల తన్ని
నఖముల చీల్చెను - రావణుకంఠము

161 ఇనుమువంటి తన - నాశికము తోడ
రావణుచాపము - తునకలుజేయ
వేరొక వింటిని - కరమున బట్టి
కడు రోషమున - శత శరములను
జటాయుపైన - ప్రయోగించగా
వైనతేయుడు - కాలనాగులను
పట్టిన రీతిని - ఆ శరములను
తనపాదముల - పట్టివిసరెను

162. అటుపిమ్మట ఆ - విహగరాజు జని
రావణురథము - చిందర జేసెను
రథసారథిని - ధరణిని గూల్చెను
రావణుకవచము - ధ్రుంచి విసరెను
రావణుతనువును - నఖముల జీల్చగ
రుధిరధారలు - బయటకు జిమ్మగ
ఎందుబోయినా - చావు తప్పదని
దర్పముతో ఖగ - రాజు పలికెను

163 పిరికివానివలె - పరుగులిడకుమా
ధరణీసుతను - నీవువిడువుమా
నిజముగ నీవు - శూరుడవైన
రామలక్ష్మణులు - వచ్చునందాక
నిలువు నిలువుమో - దనుజరావణా
రఘువీరునితో - పోరుసలుపుము
కూడును నీకు - పెద్దనిద్దుర
దానిముహూర్తము - నే పెట్టెదనని

164 మత్తగజముపై - మావటివోలె
రావణుభుజముల - వాలి జటాయువు
భుజకీర్తులను - పదముల తన్నెను
తన నఖములచే - గాత్రము జీల్చి
శిరమును తన్ని - కురులను పీకి
కడు హింసించుచు - దనుజాధిపుని
కాలుడు వేసె - నీకుపాశము
ఎందుబోయిన - చావుతప్పదనె

**రావణుడు జటాయు పక్షములు నరకుట**

165 ఎగిరిఎగిరి ఆ - రావణాసురుని
వామకరములు - పదియుద్రుంచగా
వానివెనువెంట - భుజముల నుండి
పదికరమ్ములు - పొడుచుకొచ్చెను
దంతములను దశ - కంఠుడు కొరకుచు
జటాయు పదములు - రెక్కలునరుకగ
రామాయనుచు - ఆ పక్షీంద్రుడు
ధరణినిగూలెను - రక్తపుమడుగున

166 ధరణీ పుత్రి - పరుగున బోయి
ఖగరాజునిగని - కడు దుఃఖించెను
రావణుడంతట - సీతనుబట్టి
గగన మార్గమున - ఎగిరి పోయెను
దుష్టశిక్షణా - శిష్టరక్షణా
గావించుటకే - మహావిష్ణువే
శ్రీరామునిగా - ధరజనియించె
రావణుద్రుంచగ-అనె ఋషులంతట

167. రత్నఖచితమగు - పాదకడియములు
కనకమయమ్మగు - రత్నహారములు
గగనసీమ విడి - జారుతారలై
దివ్యకాంతులతో - ధరణినిబడెను
మంచిముత్యముల - మాలికలు తెగి
గగనగంగవలె - పుడమినిజేరె
పంచభూతములు - కలవరమొందెను
కర్మసాక్షికి - కాంతులు తగ్గెను

**సీత ఆభరణములను మూటగట్టి పంచకపులదరి పడవైచుట**

161 గగనమార్గమున - తననుగొనునెడ
సీత రావణుని - కడునిందించెను
ఆ సమయంబున - గిరిశిఖరమ్మున
జానకిగాంచెను - పంచకపులను
తననుగూర్చి తన - పతిరామునకు
తెలియజేతురని - మదినిదలంచి
బంగరుసొమ్ములు - కొంగునగట్టి
సీతవిడచె ఆ - కపులముందర

**రావణుడు సీతతో అంతఃపురమును జేరుట**

169 రామరామయని - పలువరించెడి
ధరణిజనుగనె - ఆ కపులందరు
దానవనాధుడు - కడుదర్పమున
దాటెవనములు - గిరిశిఖరమ్ములు
పంపనుదాటి - జలనిధిదాటి
చేరెరయంబున - లంకాపురము
ఉంచెను జానకి - నంతఃపురమున
కావలిపెట్టెను - రక్కసివనితల

170.అంత రావణుడు - త్రిజటను గాంచి
సౌధముదరికి - రానీకెవరిని
జానకికోరిన - వస్తువులన్నీ
అడ్డుచెప్పక - ప్రీతిగనిమ్మనె
అచ్చటనేగల - అష్టరాక్షసుల
గాంచిపలికె - దశకంఠుడీవిధి
ఆయుధములను - కేల్గైకొని
అరుగుడు మీరు - దండకవనికి

171 దండకమందున - జనస్థానమున
ఖరధూషణాది - రాక్షసవీరుల
రాముడొక్కడే - నుక్కడగించెను
రామునిరణమున - జంపినగాని
ఆదమరచిని - దురింపజాలను
ఇది నాశపథము - రక్కసులార
దండకమందున - తిరుగురాముని
పవలురేయనక - కనిపెట్టుడనె

172 అని పలికిన ఆ - లంకాధీశుడు
నిజభవనమును - జేరిన పిమ్మట
మదనతాపమున - మదోద్ధతుండై
మరలివచ్చి ఆ - సీతనుగాంచె
బంగరుపూతలు - పూసినమేడలు
చలువరాతితో - కట్టినమిద్దెలు
మణిమయకాంచన - ద్వారబంధములు
మదికింపుగ తిల - కించుము నీవనె

173 చిలకలు పులుగులు - గుంపులు గుంపులు
ఫలపుష్పములతో - నిండిన తరువులు
పద్మాకరముల - నిండిన సరసులు
ఇంపుసొంపులగు - ఉద్యానములు
ముప్పదియు మరి - రెండు కోటులు
దనుజాలు నిత్యము - నన్ను కొలుతురు
ఒక్కొక్కపని - వేయి అసురులు
జేయగనుందురు - ఈ భవనమున

174 వేలకొలది దే - వేరులు గలరు
వారందరు కడు - ఉత్తమాంగనలు
నేడునీవు నను - పరిణయమాడిన
నేజేసెద నిను - పట్టపురాణిగ
శతయోజనముల - ఉన్నరాముని
తలచితాపము - చెందెదవేలా
రాజ్యహీనుడు - అల్పతేజుడు
నీకయోగ్యుడు - సన్యాసిరాముడు

175 పద్మములవంటి – నీ మృదుపదముల
నా శిరసొంచి – మరిమరి వేడెద
నేటివరకు నే – ఏ సుందరికడ
దాసునివలె – ప్రణమిల్లగలేదు
కావుననీవు – నన్నుమరునిగా
ఆహ్వానించి అ – నుగ్రహింపుము
అటులకానిచో – నీ భృత్యునిగా
స్వీకరింపుమని – రావణుడనెను.

176. శంకవలదు – ఇందీవరనేత్రి
లంకారాజ్యము – ఏలుమునీవు
నే నిపుడే ప – ట్టాభిషేకము
జేసెదనీవం – గీకరించిన
సర్వచరాచర – భూతకోటులు
నీకుసపర్యలు – జేయుచుండగా
పుష్పకంబున – గగనవిహారము
చేయుచు సుఖముల – తేలియాడుదము

**సీత రావణుని దూషించుట**

177.ఈరీతిగ దశ - కంఠుడు పలుక
కొంగుచాటున - మోము దాచుకొని
జల జల జల - కన్నీరుకార్చుచు
త్రిభువనమ్ముల - పూజనీయుడు
విస్రుతనాముడు - విపులనేత్రుడు
నా పతిదేవుడు - దైవసమానుడు
అట్టివానిని - చులకనజేసి
మాటలాడుట - నీకుతగనిపని

178.వినాశకాలే - విపరీతబుద్ధిః
అనినీ వెరుగవ - ఓ దశకంఠా
ఇనుడువిధులను - తప్పినగాని
వననిధులన్నియు - ఇంకినగాని
హవ్యవాహనుడు - ఆరినగాని
మేరుపర్వతము - కూలినగాని
నా పతిదేవుడు - రణరంగమున
నిన్ను గూల్చుట - తథ్యమురావణ

179 మైథిలిపలుకులు - వినిన రావణుడు
కడురోషమ్మున - ఇటులపలికెను
బలాత్కారమున - నే వరియింపను
విశ్వాసముతో - నను ప్రేమింపగ
నీకిచ్చెద పది - రెండుమాసములు
అటుపిమ్మట నను - చులకన జేసిన
వంటవారు నిను - తునకలుజేసి
కమ్మకమ్మగా - వండుకు తినెదరు

**రావణుడు రాక్షసస్త్రీలను సీతకుకాపుంచుట**

180 ధూమకేతువై - వెలుగు అసురుడు
అసురవనితలకు - ఆజ్ఞనొసంగెను
మానితమైన - అశోకవనికి
అతి రహస్యముగ - సీతను జేర్చుడు
పరులకంట పడ - కుండ జూడుడు
పవలురేయనక - కావలిగాయుడు
సామదానముల - మనసు మార్చుడు
నావశమగున - ట్లామెను జేయుడు

181. రావణునానతి - శిరమునదాలిచి
అసురవనితలు - జానకిని గొనె
ఎల్లకాలముల - ఫలపుష్పములతో
అందములొలికే - అశోకవనికి
ఆడపులులచే - చుట్టుముట్టిన
హరిణమువోలె - ధరణిజఅపుడు
కడుభీకరులగు - రాక్షసవనితల
గాంచినంతనె - బెదరి మూర్ఛిలె

182. కామరూపుడగు - మారీచుని ద్రుంచి
కడువేగంబున - పర్ణశాలకు
వచ్చురామునికి - మార్గమందున
దుశ్శకునములు - గోచరించెను
నాకంఠస్వర - మనుకరించుచు
మారీచుడిడిన - మాయకేకవిని
నా సతిసీత - ఏమని వగచెనో
అని శ్రీరాముడు - ఆలోచించెను.

## రాముడు దుర్నిమిత్తములు గాంచుట

183 అని తలచుచు రఘు - రాముడు నడువగ
దీనవదనుడై - వచ్చు లక్ష్మణుని
గాంచి రాముడు - అచ్చెరువొందెను
అనుజాలక్ష్మణ - ఏమటులుంటివి
సీతనువదలి - ఏలవచ్చితివి
రజనీచరులు - మాయలుపన్నిరి
ఆశ్రమంబున - సీతనువారు
ఉంచిరొలేరో - పోయిచూదము

184. వామలోచనము - వామభుజమును
ఆగకుండగా - అదురుచున్నవి
సీతకుఆపద - సంభవించెనని
రక్కసులెవరో - హరియించితిరని
నామది పరిపరి - చెప్పుచున్నదని
పలికెడి రాముని - గాంచి లక్ష్మణుడు
అనుజా నామన - వాలకింపుము
నాకు నేనుగా - రాలేదిటకు

**లక్ష్మణుడు రామునకుత్తరమిచ్చుట**

185 హా! సీతా! హా! - లక్ష్మణాయనెడి
ఆర్తనాదమును - ఆలకించగనె
కడుఆపదలో - నీవుంటివని
నీవేఅటుల పి - లచుచుండివని
వదినగారు నను - రయమున పొమ్మన
రామునిగూర్చి - దిగులువలదని
కడుక్షేమంబుగ - తిరిగివచ్చునని
నేపలుకగ కో - పించెను మాత

186 బంగరు లేడిగ - వచ్చినవాడు
తాటక తనయుడు - మారీచుడని
రామునిశరముల-అసువులు బాయుచు
వంచింపగ వా - డటుల అరచెనని
కడురీతులనే - జెప్పితి సీతకు
ఆ మాటలు విని - కుటిల బుద్ధితో
నీ మరణమును - కోరుకొంటినని
పలుదుర్భాషలు - ఆడెను మాత

రాముడు సీతను వెదకుట

187 అనెడి లక్ష్మణుని - వెంటనిడుకొని
బిర బిర నడచెను - పర్ణశాలకు
ప్రభచెడియున్న - ఆశ్రమమునుగని
అనుజాలక్ష్మణ - సీత లేదిట
పగగొని అసురులు - అపహరించిరో
క్రూర మృగములకు - ఆహుతాయెనో
పూవులు కోయగ - వనమునకరిగెనో
స్నానమాడగా - నదికి వెడలెనో

188 అల్లరిపెట్టగ - దాగియుండెనో
ఏమి చేయుదిం - కెందు వెదకుదు
ఎవ్వరినడుగుదు - ఏమని అడుగుదు
అనుచురాముడు - వెతను జెందగా
ధీరవరులు దుః - ఖించుట తగదని
ఎటులైనను వది - నమ్మను కనుగొని
నిన్ను జేర్చెదను - నిక్కము సుమ్మీ
అని లక్ష్మణుడు - ఊరడించెను

189 సాలతమాలత - క్రోల హింతాల
చంపక అశోక - తరువుల్లారా
మల్లె మాధవీ - కుసుమ తతులార
వనమును గాచెడి - దేవతలార
గహనభూముల - కడుయధేచ్ఛగా
విహరించెడి - గజరాజులార
గగన భాగమున - కిలకిల రవముల
సంచరించెడి - విహగములార

190 అష్టదిక్కులా - అధిపతులారా
నదీనదముల - బావుల సరసుల
జరియించెడి - జలప్రాణులారా
తేనేటీగలారా - భ్రమరములారా
చూచితిరా నా - సీతను మీరని
అడిగిన వాటినె - మరిమరి అడుగుచు
పిచ్చివానివలె - రాముడంతట
వనమునందు - తిరుగాడసాగెను

191 అటు విలపించు - రామునికనుగొని
కొండలు గుట్టలు - నదులుకోనలు
కాననమంతయు - ప్రతిధ్వనించగ
ఓ! వదినా! యని - అరిచె లక్ష్మణుడు
తిరిగి తిరిగి పృథి - వీసుతగానక
ఒంటిగ వచ్చెడు - లక్ష్మణుగాంచి
నా ప్రాణసఖి - ఓ సీతాయని
శోషవచ్చి రఘు - రాముడు మూర్ఛిలె

192 తెలివివచ్చిన - రాముడిటులనె
కోడలేది అని - మాతకౌసల్య
అడిగినచో నే - నేమి చెప్పవలె
జానకిఏది - అనిప్రశ్నించిన
మాత సుమిత్రకు - ఏమని జెప్పుదు
మాత కైకేయి - నేనెటు జూచెద
వదిన ఏదని - అడుగు అనుజాలకు
ఏ యుత్తరము - నేనీగలను

193 భార్య సీతను - అసురుల జేతికి
అప్పజెప్పినఘ - నుడు రాముడని
గేళిజేయునా - అయోధ్య ప్రజలకు
నా ముఖమెటుల - జూపగలాడను
అని విలపించుచు - అటునిటు తిరుగుచు
అనుజ లక్ష్మణా - అడయకు మిచ్చుట
వేగమే ఏగుము - అయోధ్యపురికి
సీతాపహరణ - దెలియజేయుము

194. తమ్మునిభరతుని - కౌగిట జేర్చి
చిరముగ రాజ్యము - నేలుకొమ్మని
రామునానతిగ - అతనికి జెప్పుము
సీతను అసురులు - అపహరించిరని
ముప్పురమ్మలకు - తెలియబరచుము
నన్నుగావగా తి - రుగబనిలేదు
పొమ్ములక్ష్మణా - పొందుసుఖములు
అనుచురాముడు - దుఃఖితుడాయెను

186 రాజ్యము పోయిన - తండ్రిగతించిన
పదునాల్గేండ్లు - అతి కష్టంబగు
కాననవాసము - సీతతోడుగా
గడప దలంచితి - కడు ముదంబుగా
ఒంటివాడనై - ఇక నేనేవిధి
గడపగలాడను - ఈ వనవాసము
జనకునిమాట ఎటు - నెరవేర్చెదనని
నిట్టూర్చుచు రఘు - రాముడు పలికె

**రాముడు దేవతలపై కోపించి జగత్సంహారము గావించెదనని పలుకుట**

196 సాధువర్తనుని - కన్నులురగిలెను
అగ్ని కణములే - జలజలరాలెను
భువనములను - పుట్టించిన వాడను
భువనములను - గిట్టించగలాడను
కుట్టినచో తే - లందరు జనులు
కుట్టకున్నచో - పురుగని యందురు
ముజ్జగములు - సంహారము జేసెద
ఈ క్షణమందే - నాశరములచే

197.నా హృదయేశ్వరి - సీతనుదెచ్చి
ఎవరగురేని - అప్పుజెప్పునిచో
గరుడ గంధర్వ - కింపురుషాదుల
యక్ష కిన్నెరుల - అసుర గణముల
భూజనంబులా - ఈక్షణమందే
వాడి శరములా - నే ఖండించెద
అని పలికెడి ఆ - రాముని జేరి
కడు శాంతునిగా - జేసె లక్ష్మణుడు

198 అటు పిమ్మట - ఆ భ్రాతలిరువురు
తిరిగిరి దండక - కానన మంతయు
అచ్చట ఒకచో - నెత్తుటి మడుగున
తేలియాడు జ - టాయువు కనుగొని
కామరూపియగు - రక్కసుడనుకొని
సీతను వాడే జం - పియుండునని
వాడి శరమును - పూనరాముడు
భూతల మంతయు - గజగజ వణకెను

**జటాయువు సీతాపహరణ విదంబు దెలుపుట**

199 నెత్తురు గ్రక్కుచు - డగ్గుత్తికతో
మరణబాధను - పొందు జటాయువు
ఆయుష్మంతుడా - దశరథరామా !
నే జటాయువును - దైత్యుడగాను
సుమిత్రసుతుడు- సీతాసాధ్విని
ఒంటిగ విడచి - ఏగిన పిమ్మట
రావణాసురుడు - రాక్షసరాజు
సీతాసాధ్విని - అపహరించెను

200. లలితలావణ్య - జానకీసతి
ఆర్తనాదమును - వినిన వెంటనే
గగనమార్గమున - నేనెదురేగి
పోరు సలిపితిని - దనుజాధిపుతో
ఆతని తనువును - చీల్చితి నఖముల
నానాశికతో - విరిచితి చాపము
నాపాదముల - శరముల ద్రుంచితి
చంపితి సారధి - రథము విరచితి

201 క్రోధముతో దశ - కంఠుడంతట
నా పాదములు - రెక్కలు నరికెను
సీతనుగొనుచు - అంబరవీధిని
బిరబిర చనెను - నీచదనుజుడు
రెక్కలు లేమిచె - ఎగురనైతిని
మీకొరకై ఇటు - వేచియుంటిని
అని పలికిన ఆ - విహాగేంద్రునిగని
రాముడు ప్రేమతో - అక్కున జేర్చెను

**జటాయువు మృతి జెందుట**

202 వ్యధను చెందకో - రామచంద్రుడా
ధరణీసుతను - అపహరించుకొని
వెడలె రావణుడు - దక్షిణదిశకు
నీవు గూడ ఆ - దిశకు ఏగిన
తప్పకగాంతువు - జనకతనయను
శుభకరుండవు - నీకుశుభమగు
అనుచు జటాయువు - రామపాదములు
చూచుచువీడెను - చివరిశ్వాసను

**రాముడు జటాయువున కగ్నిసంస్కారంబుగావించుట**

203 జటాయుమరణము - గాంచి రాముడు
కంటివె లక్ష్మణ - ఈ విహగేంద్రుని
నాసతిసీతను - కాపాడుటకై
దశకంఠునితో - పోరునుసలిపి
తన ప్రాణములను - ఫణముగ బెట్టెను
మన జనకుని వలె - పూజనీయుడు
చితిని వేగమె - నీవుపేర్చిన
దహనకాండను - నే జేసెదనెనె

204 ఆ జటాయువుకు - కర్మాంతరములు
యాధాతథముగా - జేసె రాముడు
పురుషోత్తముడగు - రామునికృపచే
సద్గతి పొందెను - జటాయువాత్మ
అటుపిమ్మట ఆ - రామలక్ష్మణులు
నైఋతిదిశగా - పయనముజేసి
జనస్థానమును - దాటిన పిమ్మట
క్రౌంచారణ్యము - గాంచిరంతట

**లక్ష్మణుడు అయోముఖిని విరూపి జేయుట**

205. క్రౌంచారణ్యము - దాటిన పిమ్మట
వారుజేరిరి మ - తంగవనము
క్రూరమృగములు - మహాసర్పములు
పలురకంబులగు - ఫలపుష్పములతో
అలరువనమును - పరిశీలించుచు
ముందుకుసాగిరి - సీతను వెదకుచు
అయోముఖియను - రాక్షసవనిత
వికృత రూపిణిని - గాంచిరివారు

206 ముందు నడచు ఆ - లక్ష్మణునిగని
తమిదీరాతని - కౌగిలించుకొని
నినునేనిపుడె - పరిణయమాడెద
జీవితాంతము - ఈ వనమందున
మరులుతీరగా - విహరించెదనన
సుమిత్ర సుతుడు - తనఖడ్గముచే
ముక్కుచెవులు - పాలిండ్లను గోయగ
మొర్రోయనుచు - ఆ అయోముఖి
వచ్చినదారినె - పరువిడి పోయెను

**రామలక్ష్మణులు కబంధుని వధించుట**

207 అటు పిమ్మట ఆ - రామలక్ష్మణులు
కాననములబడి - ఏగుచుండగా
పెనుగాలివలె - ఝుననిస్వానము
వారిచెవులకు - సోకెనప్పుడు
శిరమును మెడయు - లేనిమొండెము
ఉదరము నందు - పెద్ద ముఖమ్మును
యోజనబాహుని - ఏక నేత్రుని
కబంధుడనెడి - రక్కసుగనిరి

208 రక్కసుడంతట - అట్టహాసమున
రామలక్ష్మణుల - కరముల బట్టి
ఎవరు మీరు - వనికేల వచ్చిరి
ఇందుజొచ్చిన - జీవులన్నిటిని
నా నోటికి అం - దించు కరములు
కడుపునిండుగా - భుజించెదమిము
నేటితొ నిండెను - మీకు ఆయువని
రామలక్ష్మణుల - మ్రింగజూచెను

209.మదించి పలికిన - కబంధుగాంచి
బలసంపన్నుడు - ఈ దానవుడు
మనలవీడు బలి - పెట్టక ముందే
వీని బంపవలె - కాలునిపురికి
అనెడిరాముని - పలుకులనువిని
ప్రతీకారమున - శక్తి హీనులను
నృపులుచంపుట - పాడికాదని
లక్ష్మణుడంత - పలికె రామునితో

210 దక్షిణ బాహువు - రాముడు నరికె
సవ్య బాహువు - నరికె లక్ష్మణుడు
ఆర్త నాదమును - జేయుచుదనుజుడు
కూలెనుధరపై - వటవృక్షమువలె
కడుదీనముగా - రక్కసుడడిగెను
మీరలెవ్వ రే - పనిన వచ్చిరన
లక్ష్మణుడంతట - తెలియబరచెను
వారిచరితము - కడువిశదముగా

211. కబంధుడంతట - తన వృత్తాంతము
వారికి తెలిపెను - కడు వినయమున
పూర్వరూపమున - కడుసుందరుడను
తిరిగెడివాడను - భువనములెల్ల
గహన చరుల ముని - నాధులనందర
ఈ రూపంబున - భీతి గొల్పితిని
ఒక దినంబున - శాపాయుధుడు
శాపమిడెను ఈ - గతిని బ్రతకమని

212 రావణుడనెడి - రాక్షసరాజు
నా యిల్లాలిని - అపహరించి చనె
నామమొక్కటె - మాకుతెలియును
అతని నివాసము - మాకు తెలియదు
నీవా దనుజుని - ఎరిగితి వేని
పోవుమార్గము - తెలియబరచుము
అని రఘురాముడు - పలికి నంతనే
ఆ కబంధుడిటు - బదులు పలికెను

213 ఈ రూపమ్మున - జెప్పగ లేను
దయగొని రామా - దహనము జేయుము
అపుడుగలుగునా - సహజ రూపమున
కొండంతెత్తుగ - కాష్టము గూర్చి
అగ్నినిడెను ఆ - లక్ష్మణుడంతట
నేతి ముద్దవలె - కరిగి కబంధుడు
మంటలనుండి - మింటికి నెగసెను
ఎల్లదిశల వెలు - గొందె కబంధుడు

214 అంత కబంధుడు - రాముని గాంచి
సత్యవాది ప్ర - జ్ఞావిభవుండు
వీర్యవంతుడు న - రీనచరిత్రుడు
కడుధీరుడు - సుగ్రీవునాముడు
పంపదరిగల - ఋష్యమూకమను
గిరిసానుల వసి - యించు చుండెను
నీవును తమ్ముడు - త్వరితముగా జని
భాస్కరసుతునితో- చెలిమిని జేయుము

**శబరికిదర్శనమిమ్మని కబంధుడు రామునికి జెప్పట**

215 కడుమధురమగు - ఫలవృక్షముల
పంప మార్గమ - లరారుచుండును
ఆ వనమందున - వృద్ధురాలయిన
శబరి అనెడి - నామము కలది
నీ నామమునే - ధ్యానముజేయుచు
నీకొరకై అట - వేచియున్నదని
ఆ కబంధుడు - రఘురామునికి
విన్నవించి జనె - స్వర్గధామము

**రాముడు శబరిఆశ్రమము జేరుట**

216. రామలక్ష్మణులు - పంపనుజేరి
మాతంగముని - ఆశ్రమంబును
జేరిగాంచిరి - ముదుసలిశబరిని
ప్రేమమీరగా - కుశల మడిగిరి
దాశరధులను - గాంచినంతనే
ఆనందాశ్రులు - రాల్చుచు శబరి
వచ్చితివానా - రామాయనుచు
రాముని పదముల - సాష్టాంగబడె

217 పంపజలముతో - పదములు కడిగి
తగురీతిని తను - సత్కరించెను
ఆనందముతో - తన్మయమొందుచు
పాదములదరి - జేరిన శబరిని
ఓ శబరీ నీ - వ్రతములన్నియు
నిరాఘాటముగ - జరుగుచున్నవా
ఓ సాధుచరిత - నీమనసిప్పుడు
నిర్మలమయమై - చెలగుచున్నదా

**శబరి రామునకు ఆతిథ్యమిచ్చుట**

218. ఓ కోసలేయ - ఓ భవ్యచరిత
దశరథరామా - సీతావల్లభ
ననుకరుణించి - నీవిటువచ్చి
మోక్షమిత్తువని - గురువులు తెలిపిరి
చిత్రకూటమును - నీవు జేరుతరి
నా గురువులు స్వ - ర్గమును జేరిరి
ఆతిథ్యము నీ - కిచ్చుట కొరకు
నే తిరుగాడితి - వనమునంతను

219.అందునందు గల -- మధుర ఫలములను
సేకరించికడు - నింపుగనుంచితి
తనివితీర నీ - వారగించిన
నాయెడదెంతయొ - సంతసించును
రాముడంతట - ఆనందముతో
ఆరగించె ఆ - మధురఫలములు
అటుపిమ్మట - ఆ భవ్యచరిత్రి
ఆశ్రమ వింతలు - జూపె రామునికి

220 ఓశబరీ నీ - ఆతిధ్యమునకు
నామనసెంతో - సంతసించెను
కోరుకొనుము నీ - కేమికావలె
అనిరఘురాముడు - పలుకగా విని
తపోబలముచే - నాగురుదేవులు
ఇటకుదెచ్చిరి - పుణ్యతీర్ధములు
మహాఋషులను - ఇటురావించి
బహుజన్నములు - నిర్వహించిరి

221 వారి మహిమచె - ఈనాటికినీ
యజ్ఞవేదికలు - వెలుగుచున్నవి
వార్ధక్యముతో - ఇటనాగురువులు
వణకు చేతులతో - పూజలు జేసిరి
నాటికుసుమములు - నేటికికూడా
వాడకయున్నవి - వారి మహిమచే
అనుచుఆశబరి - మాతంగముని
ఆశ్రమవింతలు - చూపెరామునికి

**శబరి అసువులు బాసి నాకముజేరుట .**

222 కన్నుల నిండుగ - నిన్నుగాంచితిని
వీనుల విందుగ - పలుకులు వింటిని
కరములతో నీ - పూజలు జేసితి
ఇంతకన్న నా - కేమి కావలె
నాకుఆనతిని - నీవొసగినచో
చేరుకొందునా - గురుపాదులను
అనుచు ఆశబరి - ఆత్మసమాధిని
గావించుకొని - అసువులువీడెను

223 దివ్యశరీరము - పొందినశబరి
కాంతులీనుచు - రాముని గాంచి
గగనమార్గమున - పయనము జేసి
క్రమ్మర జేరెను - మునీంద్రుసన్నిధి
అనిమిషలోకము - ఏగుశబరిని
ఆనందముతో - గాంచె రాముడు
అటుపిమ్మటవా - రిరువురు జేరిరి
పంపదరిని గల - చిత్రకూటమును

(అరణ్యకాండము సమాప్తం)